# శ్రీదేవితో సిల్వర్ జూబ్లీ మూవీ చేయాలని..





ఇండియాలో అన్ని జనరేషన్స్‌కి తెలిసిన ఒకే ఒక పేరు శ్రీదేవి.. చైల్డ్ ఆర్టిస్టు నుంచి మామ్ వరకు జర్నీ చేయటమంటే మామూలు విషయం కాదు.. శ్రీదేవితో 24 సినిమాలు చేసిన ఏకైక దర్శకుడిని నేను.. శ్రీదేవి డేట్స్ ఇచ్చి, సురేష్‌బాబు ఫైనాన్స్ చేసి, కోన కథ అందిస్తే శ్రీదేవితో సిల్వర్ జూబ్లీ మూవీ చేస్తాను.. ఏదైనా సినిమా రిపోర్టు విన్న తర్వాత బాగుందని తెలిస్తే వెళతాం.. కానీ శ్రీదేవి సినిమాలో ఉందని తెలిస్తే ఆలోచించకుండా వెళ్తాం.. ఎందుకంటే– హండ్రెడ్ పర్సెంట్ గ్లామరస్‌గా ఉంటుంది.. యాక్టింగ్ ఇరగ్గొడుతుంది.. హండ్రెడ్ పర్సంట్ డ్యాన్స్ బాగా చేస్తుంది. అన్ని క్వాలిటీస్ ఉన్న తర్వాత హండ్రెడ్ పర్సంట్ బాగుంటుంది. ఇంత కాలం తర్వాత మామ్ అనే సినిమా సెలెక్ట్ చేసుకుందంటే.. దానికి కారణం తనకు హండ్రెడ్ పర్సంట్ నమ్మకం ఉన్న స్టోరీ.. డైరెక్టర్ దొరికాడు. సూపర్ హిట్ అవుతుంది. శ్రీదేవి ప్రధానపాత్రలో రవి ఉద్యానార్ దర్శకత్వంలో మ్యాడ్ ఫిలింస్, థర్డ్ ఐ పిక్చర్స్ పతాకాలపై నిర్మాణం జరుపుకున్న మామ్ థియేట్రికల్ ట్రైలర్ విడుదల ఆర్ ఆర్ అన్న మాటలివి.



# సన్నబడాలని సర్వయత్నాలు



హెబ్బా పటేల్.. ఇపుడు ఏంజెల్ అనే సినిమా రిలీజ్‌కోసం వెయిట్ చేస్తోంది.. ఈ సినిమా తర్వాత ఏమీ సైన్ చేయలేదు. ఎందుకంటే అమ్మడు ఎక్కువసేపు జిమ్ చేస్తోందట.. ఈ మధ్యన అమ్మడు బొద్దెక్కిందంటూ కామెంట్లు వినపడటంతో ..ఇపుడు సన్నబడటానకి సర్వ ప్రయత్నాలు చేస్తోందట.. అందుకే రోజూ జిమ్‌కు వెళు తోంది.. ఈ దెబ్బతో మరికొన్ని సినిమా అవకాశాలు వచ్చిపడాలి అనే తపపతో తెగ కష్టపడు తోందట. ఆల్ ది బెస్ట్ హెబ్బా...

# క్లిక్కుల మీద క్లిక్కులు

లక్ష్మీరాయ్..తెలుగులో సినిమాలు చేసినవి తక్కువైనా క్రేజ్ ఉందనే చెప్పాలి.. మెగాస్టార్ ఖైదీ నెం.150లో రత్తాలు.. పాటతో తెలుగు ప్రేక్షకులను తన వంపులతో మైమరపించింది. సమయం, వీలు చిక్కినపుడల్లా బీచ్‌లకు వెళ్లి బికినీలతో సెల్ఫీలు తీసుకుని అభిమానులకు నిద్ర రాకుండా చేస్తోంది. ఇపుడు పెట్టిన బ్లాక్ బికినీ ఫొటోకు కూడ ఆమె సోషల్ మీడియా పేజ్‌లో తెగ క్లిక్కులు పడుతున్నాయి..



కె.లీలా సువర్ణ

ఆదివారం వార్త
30 జూలై 2017

## విషయ విశేషం



### మంచి ముత్యాలు

ఒక గొప్ప జాతిగా మారాలనుకున్న
దేశ ప్రజలకు సామూహిక క్రమశిక్షణ అన్నది
అత్యంతావశ్యకమైన నిబంధన.
-గాంధీజీ






## భావ వీచిక



### వందే మాతరం!

'మాతృమూర్తిని ప్రేమించు, మాతృ భూమిని ప్రేమించు' అని ఒకరు చెప్పవలసిన రోజులు రావటం నిజంగా విచారకరం. సెల్‌ఫోన్ల పుణ్యమా అని ప్రతి వాళ్ల చెవుల్లో నిరంతరం పాటలు ప్రవహిస్తూనే ఉన్నాయి. కానీ అందులో దేశభక్తి గీతాలు ఉన్నాయా?...సందేహమే. నేటి పరిస్థితులను గమనించే కాబోలు మద్రాసు హైకోర్టు తాజాగా ఒక ప్రకటన చేస్తూ పాఠశాలల్లో కనీసం వారానికి ఒక్కసారైనా వందేమాతర గీతం పాడించాలని, కార్యాలయాల్లో కనీసం నెలలో ఒకసారైనా వందేమాతరం పాడాలని పేర్కొంది. జస్టిస్ ఎమ్.వి. మురళీధరన్ ఈవిషయమై ఆదేశాలు జారీచేస్తూ వందేమాతరం గీతం తమిళం, ఆంగ్ల భాషల్లో ప్రభుత్వ వెబ్‌సైట్లలోను, సోషల్ మీడియాలోనూ అందుబాటులో ఉంచవలసిందిగా డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్ఫర్మేషన్‌ను కోరారు. అంతేకాదు, ఎవరికైనా ఏకారణంచేతనైనా ఇష్టంలేని పక్షంలో వారిని బలవంతం చేయనవసరం లేదన్నారు.

నేటి యువతే దేశ భవిత. కాబట్టి కోర్టు ఆదేశానికి సానుకూలంగా స్పందించి, చక్కటి స్ఫూర్తిపొందాలన్నారు.

దేశభక్తిని ప్రబోధించే, దేశభక్తిని మదిలో నింపి, స్ఫూర్తినిచ్చే వందేమాతర గీతాన్ని పాడటానికి అభ్యంతరాలెందుకు? బాల్యం నుంచే మన మాతృభూమిపట్ల భక్తి భావం పెంపొందటం ఎంతో అవసరం. 'నా దేశం' అన్న భావన గొప్ప ఉత్తేజాన్నిస్తుంది. బంకించంద్ర ఛటర్జీ రాసిన ఈగీతం నాటినుంచి నేటివరకు స్ఫూర్తినిస్తూనే ఉంది. ఐతే ఏటా స్వాతంత్ర్యదినోత్సవం రోజునో, గణతంత్ర దినోత్సవం రోజునో దేశాన్ని, దేశభక్తిని గుర్తుతెచ్చుకుని..ఆపైన జెండాతో పాటే దేశభక్తినీ అవనతం చేసుకోవటం విచారకరం. ప్రతిభారతీయుడు నిరంతరం దేశభక్తిని శ్వాసగా చేసుకోవాలి. ప్రతితరం, తరువాతి తరానికి వందే మాతరాన్ని, ఆ స్ఫూర్తిని తప్పకుండా అందించాలి. కోర్టులు ఆదేశిస్తేగాక స్వచ్ఛందంగా వందేమాతర గీతాలాపన చేయాలి. మంచికోసం, మనకోసం.. వందే మాతరం!

## లేఖలు

### కవర్ కథనం ఆసక్తికరం

జూలై 16 వార్త ఆదివారం అనుబంధంలో 'హైడ్రోపోనిక్స్! ..నీటిపంటలు!' కవర్‌కథనం ఎంతో ఆసక్తికరంగాఉంది. నేటి కాలానికి హైడ్రోపోనిక్స్ ఎంతో అనుకూలం. అవసరాన్నిబట్టి మార్పును స్వాగతించాలి. నేల పరిమిత వనరైనందున, తక్కువ స్థలంలో ఎక్కువగా దిగుబడులను సాధించుకునే హైడ్రోపోనిక్స్ సాగును చేపట్టటం మంచిదే. మీకు మా అభినందనలు.

-ఎన్.పరిమళ, విజయవాడ; డి.శ్రవణ్, వరంగల్; కె.సత్యనారాయణ, గుంటూరు.

### సంచిక నచ్చింది...

జూలై 16 వార్త ఆదివారం అనుబంధంలో ప్రచురించిన 'హైడ్రోపోనిక్స్ ' కవర్‌స్టోరీ ఎంతో బాగుంది. సిటీలలో అపార్ట్‌మెంట్ కల్చర్‌లో స్థలం కరువైనందున అందరూ హైడ్రోపోనిక్స్‌కు జైకొట్టడం ఆవశ్యకం. పర్యావరణ హితం కూడా. కల్తీలపై కొరడా గురించిన 'సంఘీ'భావం ఎన్నో విషయాలు తెలిపింది. అలాగే డిటెక్టివ్ తరహా రచనలు ప్రచురించండి. మీకు మా ధన్యవాదాలు.

-శివలెంక నాగమల్లిక, హైదరాబాద్.

గమనిక: గత సంచికలో 'సాగిపోయే ఖాళీలు'కథా రచయిత బి.కరుణాకర్ అని ప్రచురితమైంది. రచయితపేరు బి.పి.కరుణాకర్‌గా గుర్తించగలరు.

### ముచ్చటైన మేగజైన్

వార్త ఆదివారం మేగజైన్ జూలై 16 సంచికలో 'సాహితీవనం' శీర్షికన అందించిన 'సాహిత్యంతో కరచాలనం చేయడమంటే..' భావయుక్తంగా, అక్షర ప్రగతి, అసాధారణ వ్యక్తిత్వం ఎలాఉండాలో తెలిపింది. మొగ్గలో 'మెచ్చగలరు' బాలగీతం బాలురకు బోధనలా బాగుంది. సువర్నా కన్నన్ గారి 'గడివిప్పని పట్టుచీర' కథ బాగుంది. బ్యాక్‌పేజీ సీనరీ ఆకర్షణీయంగా ఉంది.

-పక్కి రాధాగోపాలకృష్ణ, విశాఖ.

### ఆర్టికల్స్ బాగున్నాయి..

జూలై 16 వార్త ఆదివారం మేగజైన్‌లో 'సంఘీ'భావంలో కల్తీ నివారణకు కఠిన శిక్షలు అమలుచేయడమే సరైన మార్గమని చక్కగా చెప్పారు. మూఢనమ్మకాల గురించిన 'భావ వీచిక' సందేశాత్మకంగా ఉంది. చిత్రభారతిలో ఎన్.టి.రామారావ్ గురించి వాశిరాజు ఎంతో బాగా చెప్పారు.

-డా.శివ భూషణం, కర్నూలు.

### కనువిందు చేసింది..

జూలై 16 వార్త ఆదివారం మేగజైన్‌లో 'భావవీచిక' స్వచ్ఛభారత్‌ను నొక్కి చెప్పింది. సీనియర్ రచయిత్రి రాసిన 'గడి విప్పని పట్టుచీర' కథ చాలా బావుంది. ఈ వారం కవిత్వంలో కవితలన్నీ సామాజిక స్పృహకు పెద్దపీట వేశాయి. 'నీలమోహనం.. సమ్మోహనం..'బ్యాక్ కవర్ కనువిందుచేసింది.

-నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం.

'సంఘీ'భావం

# పిల్లల పెంపకమే కీలకం!



భావిభారత పౌరులను బాధ్యతాయుతంగా విలువలతో పెంచడంలో ఉపాధ్యాయుల పాత్రకన్నా తల్లిదండ్రుల పాత్రే కీలకం. పుట్టినది మొదలుకొని జీవితంలో స్థిరపడేవరకూ తల్లిదండ్రులు తమ పిల్లల పెంపకంపై శ్రద్ధ వహించాలి. ఎవరికి వారు యమునాతీరే.. అన్నట్లుగా వ్యవహరిస్తే తలెత్తే దుష్పరిణామాలు తల్లిదండ్రులనే కాకుండా వారి కుటుంబాన్ని ఇబ్బందుల్లోకి నెట్టివేస్తుంది. అందుకే ఈ రోజుల్లో 'పేరెంటింగ్' అనేది ఒక శాస్త్రంగా మారింది. తల్లిదండ్రుల పెంపకం తీరుపైనే పిల్లల భావి జీవితాలు ఆధారపడి ఉంటాయి.

బాల్యంనుంచి పిల్లలకు 'ధనం మూలం ఇదం జగత్' అని కాకుండా దానితోపాటుగా విలువలకు, మంచి వ్యక్తిత్వానికి తావిచ్చే విధంగా పిల్లలను పెంచాలి. డబ్బుకన్నా వ్యక్తిత్వమే అతిముఖ్యమని తల్లిదండ్రులే కాకుండా వారి కుటుంబీకులు పిల్లలకు తెలియచెప్పాలి. పూర్వకాలంలో ఉమ్మడి కుటుంబాలు ఉండేవి. బాధ్యతలు, అనుబంధాలు, మమతలు కలిసి పెరగడంలో ఉన్న ఆనందం తెలిసేది. కానీ ఇంటికి నలుగురు మాత్రమే మారిన సమకాలీన వ్యక్తిగత కుటుంబాల్లో పిల్లల పెంపకంలో లోపం కనిపిస్తోంది. తల్లిదండ్రులు డబ్బుపై యావతో పిల్లల బాధ్యతాయుత పెంపకాన్ని విస్మరిస్తున్నారు. చిన్నప్పట్నుంచే పాకెట్ మనీ సంస్కృతిని అలవరుస్తున్నారు. ఇది వారిని చెడుతోవ పట్టేలా చేస్తున్నది. పిల్లల పెంపకంపై ఇంతగా ఉపోద్ఘాతం ఎందుకు అంటే- ఇటీవల కాలంలో హైదరాబాద్‌లో డ్రగ్స్ విష వలయంలో స్కూలు పిల్లలు, కాలేజీల విద్యార్థులు ఉన్నారని ఎక్సైజ్ నివేదికలు వెల్లడించడంతో నిర్ఘాంతపోనివారు లేరు. తల్లిదండ్రులతో పాటు సమాజం కూడా ఈ విపరీత పరిణామాలతో నివ్వెరపోయింది. ఎందుకిలా జరుగుతోందని సమాజంపట్ల, విలువలపట్ల బాధ్యత, నిబద్ధత ఉన్నవారు ఆత్మపరిశీలన చేసుకోవడం ప్రారంభించారు.

దీనికి బాధ్యులెవరు? అనే ప్రశ్నలు ఇప్పుడు తల్లిదండ్రులు, టీచర్లు, సమాజం నుంచి వస్తున్నాయి. మానవ సంబంధాలన్నీ మనీ సంబంధాలుగా మారిన సమకాలీన సమాజంలో ప్రతీది వ్యాపారమయమైపోయింది. ఒకనాటి విలువలు కనుమరుగైపోయాయి. తల్లిదండ్రులు బాల్యంనుంచి తమ పిల్లల చదువు గురించే కాకుండా వారి మిత్ర బృందం, వారి చదువేతర కార్యకలాపాల గురించి నిఘా పెట్టడం అనివార్యమైపోయింది. చదువుతోపాటు పిల్లల సోషలైజ్డ్ కార్యక్రమాలు ఎలా ఉన్నాయో తల్లిదండ్రులు పరిశీలించాల్సిన అవసరం ఏర్పడింది. డ్రగ్స్ వినియోగంలో విద్యార్థులున్నారన్న విషయం బయట పడడం, ఆ విద్యార్థులు కూడా పేరున్న, సంపన్నులకే పరిమితమైన స్కూళ్ల, కాలేజీల పేర్లు కూడా బహిర్గతం అయ్యాయి. దీంతో ఉలిక్కిపడడం ప్రతి ఒక్కరి వంతుగా మారింది. తమ పిల్లల కలల చదువుకు కేరాఫ్ అనుకునే ప్రతిష్ఠాత్మక స్కూళ్లు, కాలేజీలే డ్రగ్స్ వినియోగంలో ముందున్నాయని డ్రగ్ పెడలర్స్ వెల్లడించడంతో అంతా విస్తుపోయారు.

సమాజం పెడధోరణుల పట్ల బాధపడనివారు కనిపించడం లేదు. పిల్లలు ఉన్నత శ్రేణి స్కూళ్లు, కాలేజీలకు వెళ్తున్నారని తల్లిదండ్రులు సంబరపడుతున్నారు. కానీ ఇల్లు దాటిన వారి ప్రపంచం ఎటువైపు వెళ్తుందనేది తల్లిదండ్రులు ఆలోచించడం లేదు. తల్లిదండ్రుల మాటున పిల్లల బహిర్గత ప్రపంచం ఏ విధంగా ఉంది? అన్నది వారు ఇంత కాలం ఆలోచించకపోవడం వల్లనే ఇవాళ డ్రగ్స్ పరిణామాలు సంభవించాయని సామాజిక శాస్త్రవేత్తలు అంటున్నారు. పిల్లలు చదువు కాకుండా ఇంటర్‌నెట్‌లో వారు ఏం చూస్తున్నారు? బయట వారికి ఎలాంటి స్నేహితులు ఉన్నారు? బయట ప్రపంచంలో వాళ్లు బార్లకు, పబ్‌లకు వెళ్తున్నారా? రేవ్ పార్టీల్లో పాల్గొంటున్నారా? అనే విషయాలను తల్లిదండ్రులు పట్టించుకోవడం లేదు. పిల్లలపై అతి విశ్వాసమే వారిని కొంప ముంచుతున్నది. డబ్బు ఉన్నది కదా! అనే అహంతో పిల్లలు ఏది అడిగితే అది ఇవ్వడం- చివరకు డ్రైవింగ్ సరిగా రాకున్నా ఖరీదైన కార్లు ఇచ్చి బయటకు పంపడంతో వాటిని రకరకాల మత్తులో నడపలేక 20 ఏళ్లకే ఈ లోకాన్ని విడిచి వెళ్తున్న అనేక సంఘటనలు ఇటీవల కాలంలో మనం చూసాం. ఈ దుష్పరిణామాలన్నింటికి బాధ్యులెవరని ప్రశ్న వేసుకుంటే ముందుగా తల్లిదండ్రులను నిందించాలి. ఆ తరువాత సమాజాన్ని నిందించాలి.

హైదరాబాద్ అవుటర్ రింగ్ రోడ్‌పై అర్ధరాత్రి రేసింగుల్లో పాల్గొని అనేక మంది ప్రముఖుల పిల్లలు చిన్నవయసులోనే మృత్యువాతకు గురయ్యారు. నగరం నడిబొడ్డున కూడా మత్తులో డ్రైవింగ్ చేస్తూ ఘోర రోడ్డు ప్రమాదంలో మరణించటం నిత్యకృత్యంగా మారింది. దీనికితోడు పది మందిలో హోదాకోసం డ్రగ్స్ వాడటం, అనైతిక రేవ్ పార్టీల్లో పాల్గొని అర్ధాంతరంగా మరణించడమో లేదా జైలు పాలవడమో చూస్తున్నాం. ఇవన్నీ చూసి, విన్న తరువాత కూడా తల్లిదండ్రులు మేల్కొని పిల్లల పెంపకంపట్ల మరింత బాధ్యతగా వ్యవహరించాల్సిన అనివార్య పరిస్థితి ఏర్పడింది.

ఉపాధ్యాయులు వివిధ సబ్జెక్టులను బోధించడమే కాకుండా నైతిక విలువల పట్ల పాఠ్యాంశాలు లేకున్నా విద్యార్థులకు అవగాహన కల్పించాలి. డబ్బు సంపాదనకన్నా వ్యక్తిత్వమే ముఖ్యమని వారు తెలియజెప్పాలి. సంపన్నత డబ్బులో కాకుండా గుణంలో ఉండాలని ఉపాధ్యాయులు కూడా విద్యార్థులకు బోధనలో లేకున్నా చెప్తూ ఉండాలి. ఇల్లు తరువాత విద్యార్థులు ఎక్కువ సమయం గడిపేది స్కూళ్లు, కాలేజీలు కావడంవల్ల ఉపాధ్యాయులు, ప్రొఫెసర్లు తమ విద్యార్థులు సత్ప్రవర్తనతో మెలిగేలా చూడాలి.

విద్యార్థులు పక్కదారి పట్టి నేరాల్లో ఇరుక్కుపోవడమో, కూరుకుపోవడమో జరిగినపుడు చట్టం కూడా తన పని తాను చేయాలి. కానీ నేటి యువత డబ్బు అహంలో తాము ఏ తప్పు చేసినా డబ్బుతో ఏదైనా కొనేయవచ్చనే అపోహలో ఉన్నారు. ఏ చిన్న తప్పు జరిగినా దానికి చట్టంప్రకారం శిక్ష పడుతుందనే భయం కూడా వచ్చేలా చట్టాల అమలు కూడా ఉండాలి. స్కూళ్లలో, కాలేజీల్లో ర్యాగింగ్‌లో వికృత ప్రవర్తన కూడా వివిధ దుష్పరిణామాలకు దారి తీస్తున్నది. ర్యాగింగ్ వ్యతిరేక చట్టాలు ఎన్ని ఉన్నా, అవగాహన ఎంత కల్పించినా అవి విద్యార్థులపై ప్రభావం చూపలేకపోతున్నాయి. తత్ఫలితంగానే ర్యాగింగ్ మరణాలు కొనసాగుతున్నాయి.

వరుసగా జరుగుతున్న ఈ విషాద సంఘటనలన్నీ సమాజానికి, తల్లిదండ్రులకు హెచ్చరికలు అని చెప్పక తప్పదు.

– డాక్టర్ గిరీష్‌కుమార్ సంఘీ




# ఓట్ల రాజకీయం

– ఎ.వి.వి. ప్రసాద్

**ఓటు విలువ మారె, ఓటి మాటలు తేలె**
**స్వార్ధ రాజకీయ శక్తులేవొ..**
**రాష్ట్రపతిని కడకు "రంగు" బొమ్మను చేసె..**
**విశ్వవినుత నామ! వినురవేమ!!**

విపక్షాల మధ్య సయోధ్య ఎంతగా లోపించిందో తెలుపడానికి కూడా ఈ ఎన్నికలనే ఉదాహరణగా చెప్పవచ్చు. లోక్‌సభ, అసెంబ్లీలకు జరిగే ఎన్నికల్లో కనిపించే ఓట్ల చీలిక రాష్ట్రపతి ఎన్నికల్లోనూ కనిపించిందంటే మన ప్రజాస్వామిక వ్యవస్థ ఏ దిశలో పయనిస్తున్నదో అర్థమవుతుంది. ఎమ్మెల్యేలు, ఎంపీలు సిద్ధాంతాలకు తిలోదకాలిస్తున్న విషయం ఎప్పటినుంచో వింటున్నదే అయినా, తాజా రాష్ట్రపతి ఎన్నికలో అది మరింత ఎక్కువగా కనిపించడం విశేషం. రాజకీయాలకు, పార్టీలకు అతీతంగా రాష్ట్రపతి ఎన్నిక జరగాలనే విధానానికి కూడా పార్టీలు ఈ ఎన్నికలో చరమగీతం పాడినట్లు కనిపిస్తుంది. అధికార పక్షం, విపక్షాలు కుమ్మక్కవడం గతంలో ఏ రాష్ట్రపతి ఎన్నికలోను జరగనంతగా ఈ ఎన్నికలో జరిగిందని చెప్పాలి. రాష్ట్రపతి పదవిని సైతం ఒక ఎమ్మెల్యే స్థాయికి పార్టీలు దిగజార్చివేశాయి.

రాష్ట్రపతి ఎన్నిక ఫలితం అంచనాలకు తగినట్లుగానే వచ్చింది. యుపిఎ అభ్యర్థిగా బరిలోకి దిగిన శ్రీమతి మీరాకుమార్ గెలుపొంద గలరని రాజకీయ విశ్లేషకులు ఏ దశలోనూ ఊహించలేదు. 14వ రాష్ట్రపతిగా రామ్‌నాథ్ కోవింద్ ఎన్నిక లాంఛనప్రాయమే. అయితే ఎక్కడో, ఏదో జరిగింది. 'రాజకీయం' రంగప్రవేశం చేసింది. రాష్ట్రపతి ఎన్నిక కూడా రంగులు మారింది. బహుశా అందుకే కావచ్చు. కోవింద్ భారీ మెజారిటీతో ఎన్నికయ్యారు. శ్రీమతి మీరా కుమార్‌కు తప్పనిసరిగా ఓట్లు పడతాయనుకొన్న కొన్ని రాష్ట్రాలలో చివరి క్షణంలో లెక్కలు మారి అక్కడ కూడా రామ్‌నాథ్‌కే పెద్దపీట లభించింది. అందుకే ఆయనకు లభించిన ఓట్ల విలువ 65.7 శాతం ఉండగా, మీరాకుమార్‌కు 34.3 శాతం మించలేకపోయింది.

రామ్‌నాథ్ కావచ్చు, మీరాకుమార్ కావచ్చు. ఎవరు గెలిచినా ఒక దళితనేత, ఆ అగ్రపీఠాన్ని అధిష్ఠిస్తారనేది నిర్వివాదాంశం. చాలా పోటాపోటీగా యుపిఎ, ఎన్‌డిఎలు తమ అభ్యర్థులను ఈసారి బరిలోకి దింపాయి. ఒక కులం రంగు పులుముకొని రాష్ట్రపతి అభ్యర్థి పోటీ చేయడం ఈ ఎన్నికల్లో ఒక విశేషమైతే, ఆర్‌ఎస్‌ఎస్ వంటి మత ప్రధాన సంస్థకు చెందిన నేత ఎన్నికవడం మరో విశేషం. కోవింద్‌కు మరికొన్ని ప్రత్యేకతలు కూడా ఉన్నాయి. గతంలోని కె.ఆర్. నారాయణన్ తర్వాత మళ్లీ ఒక దళితనేత ఎన్నికవడం రామ్‌నాథ్‌తోనే జరిగింది. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత బిజెపి నుంచిగాని, ఆర్‌ఎస్‌ఎస్ నుంచి గాని తొలిసారి ఎన్నికవడం ఒక ప్రత్యేకత అయితే యుపి నుంచి ఎన్నికవడం మరో ప్రత్యేకత. ఇక్కడ గమనించవలసిన అంశం- రాష్ట్రపతి, ప్రధాని ఇద్దరూ యుపికి చెందినవారే కావడం. దానిలో మోడీ- అమిత్‌షాల 'రాజకీయం' కూడా స్పష్టంగా అర్థమవుతోంది. యుపిలో బిజెపికి తగినంత బలం ఉన్నప్పటికీ ఏ దశలోనూ ఫలితాలు తారుమారు కాకుండా అక్కడ ఎస్‌పిని, బిఎస్‌పిని మట్టి కరిపించడానికే రామ్‌నాథ్‌ను ఎంపిక చేసినట్లుగా కనిపిస్తుంది.



రామ్‌నాథ్ దళిత నేతగా బరిలోకి దిగినా, 1997లో కెఆర్ నారాయణన్‌కంటె తక్కువ శాతం ఓట్లు పొందడం గమనించవలసిన మరో అంశం. అప్పట్లో నారాయణన్‌కు గంపగుత్తగా 95శాతం ఓట్లు లభించగా, ప్రత్యర్థి అయిన మాజీ ఎన్నికల ప్రధాన కమిషనర్ టిఎన్ శేషన్‌కు కేవలం 5 శాతం ఓట్లే లభించాయి. అంటే దళితుల ఓట్లలో చీలిక రావడం ఈ ఎన్నికలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఇంతవరకు గల పదమూడు మంది రాష్ట్రపతుల్లో డాక్టర్ రాజేంద్రప్రసాద్‌కు అత్యధికంగా 99 శాతం ఓట్లు లభించగా, వివి గిరికంటె కొంచెం ఎక్కువగా మాత్రమే రామ్‌నాథ్‌కు లభించాయి. ఈ ఎన్నికలో ఆయనకు భారీగా ఓట్లు వచ్చిన మాట వాస్తవమే అయినా, గత ఎన్నికలతో పోల్చితే కోవింద్‌కు తక్కువ శాతమే ఓట్లు వచ్చినట్లు కనిపిస్తుంది.

బిజెపి బలప్రదర్శనకు రాష్ట్రపతి ఎన్నికను వేదిక చేసుకొన్నారని కూడా అనిపిస్తుంది. గుజరాత్‌తో పాటు పశ్చిమ బెంగాల్, గోవా, మహారాష్ట్ర తదితర రాష్ట్రాలలో ఈ బలప్రదర్శన మరింత అధికంగా కనిపించింది. విపక్షాలకు చెందిన పలువురు ఎంపీలు, ఎమ్మెల్యేల మద్దతును సాధించడంలో మోడీ వ్యూహాన్ని ఈ సందర్భంగా ప్రశంసించవలసిందే. ఎన్నికల్లో గెలుపు ఒక్కటే అంతిమ లక్ష్యమైనప్పుడు పార్టీల వ్యూహకర్తలు ఏ విధమైన మార్గం అనుసరిస్తారో మోడీ-అమిత్‌షాలు ఈ ఎన్నికలో ఆ మార్గం అనుసరించినట్లుగానే కనిపిస్తుంది. పంజాబ్, త్రిపుర, ఢిల్లీ, బీహార్‌లో కూడా అందుకే అధిక ఓట్లు రామ్‌నాథ్‌కు అనుకూలంగా లభించినట్లు స్పష్టమవుతుంది.

ఓట్లను చీల్చడం, క్రాస్ ఓటింగ్‌ను ప్రోత్సహించడం ఈ ఎన్నికలోనే అధికంగా కనిపిస్తుంది. గతంలో కూడా క్రాస్ ఓటింగ్ అనేది జరిగినా ఆ శాతం ఈ ఎన్నికలో చాలా ఎక్కువగా కనిపిస్తుంది. ఉదాహరణకు ఉత్తరప్రదేశ్‌నే తీసుకొంటే అక్కడ ఎంపిల ఓట్లను చీల్చడంలో బిజెపి ఎలాంటి పాచిక వేసిందో అర్థమవుతుంది. అఖిలేష్‌యాదవ్ నాయకత్వంలోని సమాజ్‌వాది పార్టీకి లోక్‌సభలో ఆరుగురు ఎంపీలు, రాజ్యసభలో 19 మంది ఎంపీలు ఉండగా ములాయం, అఖిలేష్‌లు పార్టీలోని ఎంపిలలో చీలిక తేవడంతో ఆ చీలిన ఓట్లు బిజెపికి అనుకూలంగా పడడంతో అక్కడ అధికార పార్టీ మరింత బలాన్ని పుంజుకొన్నట్లు కనిపిస్తుంది. అఖిలేష్ యాదవ్, మీరాకుమార్ అభ్యర్థిత్వాన్ని బలపరచగా, ఆయన తండ్రి ములాయం, కోవింద్‌కు ఓటు వేశారు. ములాయం సోదరుడైన ఎమ్మెల్యే శివలాల్ యాదవ్ కూడా కోవింద్‌కే ఓటు వేశారు. సాధారణ ఎన్నికలకు ముందునుంచి అఖిలేష్ వర్గానికి, ములాయం వర్గానికి మధ్య విభేదాలు కొనసాగుతుండడంతో వాటిని బిజెపి ఈ ఎన్నికల్లో సమర్థంగా ఉపయోగించుకొన్నదనిపిస్తుంది. యుపిలో ఓట్లు భారీగా చీలాయనడానికి ఎమ్మెల్యేల ఓట్లు కూడా మరో ఉదాహరణ. సమాజ్‌వాది, కాంగ్రెస్‌కు కలిపి ఆ రాష్ట్రంలో 54మంది శాసనసభ్యు

లున్నారు. బహుజన్ సమాజ్ (బిఎస్‌పి) పార్టీకి 19 మంది ఎమ్మెల్యేలున్నారు. అంటే మీరాకుమార్‌కు పడవలసిన ఓట్లు 73 అన్నమాట. కానీ 65 మాత్రమే పడ్డాయి. దీన్నిబట్టి చూస్తే సమాజ్‌వాది పార్టీ నుంచి క్రాస్ ఓటింగ్ భారీగా జరిగినట్లు కనిపిస్తుంది. ఈ విషయంలో బిజెపి లోపాయికారిగా ఆయా పార్టీలతో కుమ్మక్కయినట్లుగా కనిపిస్తుంది.

మరో పెద్ద రాష్ట్రం పశ్చిమ బెంగాల్‌లో కూడా ఓట్లలో భారీ చీలిక వచ్చినట్లు కనిపించడం గమనించవలసిన అంశం. ఆ రాష్ట్రంలో బిజెపికి ఉన్నది ఇద్దరు శాసనసభ్యులే. భాగస్వామ్య పక్షమైన జిజెఎంకు మాత్రం ముగ్గురు శాసనసభ్యులున్నారు. కానీ కోవింద్‌కు 11 ఓట్లు పడ్డాయి. అంటే కాంగ్రెస్ నుంచిగాని, తృణమూల్ కాంగ్రెస్‌నుంచి గానీ ఏడుగురు సభ్యులు కోవింద్‌కు మద్దతిచ్చారన్న మాట. ఎంపీలు శాసనసభ్యులతో కలసి రాష్ట్ర శాసనసభలోనే ఓటు వేయాలని ముఖ్యమంత్రి మమతా బెనర్జీ ఆదేశించినా ఇద్దరు ఎంపీలు పార్లమెంటులో ఓటు వేశారంటే బిజెపి ఆ రాష్ట్రంలో ఎలాంటి 'పాత్ర' పోషించిందో అర్థమవుతుంది.

ప్రతిపక్షాలు అధికారంలో ఉన్న రాష్ట్రాల నుంచి కూడా బిజెపి ఇలా తనకు అనుకూలంగా ఓట్లను మలచుకోవడం ఈ ఎన్నికలలోనే అధికంగా కనిపిస్తుంది. గుజరాత్ నుంచి ఇటీవల కాంగ్రెస్‌కు రాజీనామా చేసిన శంకరసింగ్ వాఘేలా వంటి సీనియర్ నేతలు ఈ ఎన్నికల్లో బిజెపికి పరోక్ష మద్దతు ఇచ్చినట్లుగా భావిస్తున్నారు. ఆ రాష్ట్రంలో ఎవరికి పడిన ఓట్లు ఏమిటో పరిశీలిస్తే ఈ విషయం స్పష్ట మవుతుంది. గుజరాత్‌లో కాంగ్రెస్‌కు 57 మంది సభ్యులుండగా, కాంగ్రెస్ నేతృత్వంలో విపక్షాలు బలపరచిన మీరాకుమార్‌కు 49 మంది మాత్రమే ఓటు వేసినట్లు స్పష్టమవుతోంది. అంటే ఎనిమిది మంది కాంగ్రెస్ సభ్యులు కోవింద్‌కు ఓటు వేశారన్నమాట. వారందరు వాఘేలా వర్గానికి చెందినవారేనని తెలుస్తోంది. కాంగ్రెస్ సీనియర్లే ఆ పార్టీకి నమ్మకద్రోహం ఎలాచేశారో చెప్పడానికి గుజరాత్‌లో పోలయిన ఓట్లే ఉదాహరణ. మహారాష్ట్రలో కూడా ఓట్లలో చీలిక భారీగానే ఉంది. అక్కడ బిజెపి, శివసేన కూటమికి 185మంది సభ్యులుండగా, కోవింద్‌కు 208 ఓట్లు పడినట్లుగా తెలుస్తోంది. అంటే కాంగ్రెస్, ఎన్‌సిపిలకు చెందిన 23 మంది ఎమ్మెల్యేలు కప్పదాటు వేశారన్నమాట.

*******

విపక్షాల మధ్య సయోధ్య ఎంతగా లోపించిందో తెలుపడానికి కూడా ఈ ఎన్నికలనే ఉదాహరణగా చెప్పవచ్చు. లోక్‌సభ, అసెంబ్లీలకు జరిగే ఎన్నికల్లో కనిపించే ఓట్ల చీలిక రాష్ట్రపతి ఎన్నికల్లోనూ కనిపించిందంటే మన ప్రజాస్వామిక వ్యవస్థ ఏ దిశలో పయనిస్తున్నదో అర్థమవుతుంది. ఎమ్మెల్యేలు, ఎంపీలు సిద్ధాంతాలకు తిలోదకాలిస్తున్న విషయం ఎప్పటినుంచో వింటున్నదే అయినా, తాజా రాష్ట్రపతి ఎన్నికలో అది మరింత ఎక్కువగా కనిపించడం విశేషం. రాజకీయాలకు, పార్టీలకు అతీతంగా రాష్ట్రపతి ఎన్నిక జరగాలనే విధానానికి కూడా పార్టీలు ఈ ఎన్నికలో చరమగీతం పాడినట్లు కనిపిస్తుంది. అధికార పక్షం, విపక్షాలు కుమ్మక్కవడం గతంలో ఏ రాష్ట్రపతి ఎన్నికలోను జరగనంతగా ఈ ఎన్నికలో జరిగిందని చెప్పాలి. రాష్ట్రపతి పదవిని సైతం ఒక ఎమ్మెల్యే స్థాయికి పార్టీలు దిగజార్చివేశాయి.

బీహార్ వంటి రాష్ట్రాలలో పోలయిన ఓట్ల సరళిని చూస్తే ఈ విషయం అర్థమవుతుంది. ఆ రాష్ట్రంలో జెడి(యు), కాంగ్రెస్, ఆర్‌జెడి కూటమి అధికారంలో ఉంది. అయితే కాంగ్రెస్, ఆర్‌జెడి నిర్ణయానికి విరుద్ధంగా జెడి(యు) ఎన్‌డిఏ అభ్యర్థి అయిన కోవింద్‌కు మద్దతునిచ్చింది. ఇక్కడ గమనించవలసిన విషయం ఏమిటంటే కాంగ్రెస్ సైతం తన 'రూటు' మార్చుకోవడం. జెడి(యు), ఎన్‌డిఎలకు కలిపి బీహార్‌లో 129 మంది ఎమ్మెల్యేలుండగా, కోవింద్‌కు మాత్రం 130 ఓట్లు వచ్చాయి. అంటే ఆర్‌జెడి లేదా కాంగ్రెస్ నుంచి ఒకరు కోవింద్‌కు ఓటు వేశారన్నమాట. అయితే కాంగ్రెస్ సభ్యుడే క్రాస్ ఓటింగ్‌కు పాల్పడ్డాడనే అభిప్రాయం వినిపిస్తోంది.

పంజాబ్‌లో సైతం ఇదే ధోరణి కనిపించింది. అక్కడ నిజానికి బిజెపి, అకాలీదళ్‌కు కలిపి 15 మంది శాసనసభ్యులు మాత్రమే ఉండగా, కోవింద్‌కు మాత్రం 18 ఓట్లు పడినట్లుగా తెలుస్తోంది. అంటే కాంగ్రెస్, ఆమ్ ఆద్మీ పార్టీ రెండింటి నుంచి లేదా విడివిడిగా క్రాస్ ఓటింగ్ జరిగి ఉండవచ్చని భావిస్తున్నారు. క్రాస్ ఓటింగ్ చేసిన ముగ్గురూ ఆమ్ ఆద్మీకి చెందినవారేనని రాజకీయ విశ్లేషకుల అభిప్రాయం.

దీనినిబట్టి చూస్తే బిజెపియేతర రాష్ట్రాలలో కూడా ఆ పార్టీ 'చక్రం' తిప్పినట్లుగా స్పష్టమవుతుంది. ఇక ఆమ్ ఆద్మీ పార్టీ అధికారంలో ఉన్న ఢిల్లీలో కూడా బిజెపికే అధిక ఓట్లు పడినట్లు తెలుస్తోంది. కేజ్రీవాల్ నిర్ణయానికి విరుద్ధంగా ముగ్గురు ఎమ్మెల్యేలే కోవింద్‌కు అనుకూలంగా ఓటు వేసినట్లు సమాచారం. ఢిల్లీ అసెంబ్లీలో ప్రస్తుతం 67 మంది శాసన సభ్యులుండగా వారిలో ఆరుగురి ఓట్లు చెల్లకుండా పోయాయని అధికారులు చెబుతున్నారు. అంటే 61 మంది మాత్రమే ఓటు హక్కు వినియోగించుకొన్నట్లన్నమాట.

ఇందులో ముగ్గురు బిజెపికి చెందినవారు, వారిలో మీరాకుమార్‌కు 55 మంది ఓటు వేయగా, కోవింద్‌కు ఆరు ఓట్లు వచ్చాయి. ఇక్కడ నిజానికి కోవింద్‌కు ఒక్క ఓటు కూడా పడే పరిస్థితి లేకపోయినా ఆరు ఓట్లు వచ్చాయంటే 'ఓట్ల సమీకరణ'లో బిజెపి ఎన్ని మార్గాలు అనుసరించి ఉంటుందో అర్థమవుతుంది. ఇక హర్యానా, త్రిపుర వంటి కొన్ని చిన్న రాష్ట్రాలలో కూడా బిజెపికి అనుకూలంగా ఓట్లు చీలినట్లు తెలుస్తోంది. హర్యానా కాంగ్రెస్ పార్టీలో భూపిందర్ సింగ్ హూడా, అశోక్ తన్వర్ వర్గాల మధ్యగల విభేదాలు ఎన్‌డిఏ అభ్యర్థి కోవింద్ ఓట్ల శాతం పెంచడానికి ఉపకరించాయి. త్రిపురలో తృణమూల్ కాంగ్రెస్‌కు చెందిన ఆరుగురు ఎమ్మెల్యేలు పార్టీ నిర్ణయానికి విరుద్ధంగా కోవింద్‌కు ఓటు వేసినట్లు తెలుస్తోంది. అక్కడ అధికార సిపిఎంను వ్యతిరేకిస్తూ వారు ఎన్‌డిఏ అభ్యర్థికి ఓటు వేశారు. అంటే వామపక్షాలలో కూడా చీలికలు పెరగడానికి బిజెపి యత్నించిందన్నమాట.

అట్టడుగు వర్గాల ప్రతినిధిగా కోవింద్ రాష్ట్రపతిగా ఎన్నికవడం ముదావహమే అయినా, ఆ ఎన్నిక వెనుక భారీగా చీలిన ఓట్లు కీలకపాత్ర పోషించడం గమనిస్తే 'రాజకీయం' ఏ స్థాయిలో తాండవిస్తున్నదో అర్థమవుతుంది. తాము సైద్ధాంతిక యుద్ధం చేస్తున్నామని ఇద్దరు అభ్యర్థులు కూడా ప్రకటించినా, వారికి మద్దతు ఇచ్చిన పార్టీలు మాత్రం ఓట్ల యుద్ధమే చేశాయి. కుల, మత, వర్గ, ప్రాంతాలకు అతీతంగా రాష్ట్రపతిని ఎన్నుకోవాలనే సిద్ధాంతం ఈ ఎన్నికలో లేశమైనా కనిపించలేదనే చెప్పాలి. రాష్ట్రపతి ఏకగ్రీవంగా ఎన్నికవ్వాలనే అభిప్రాయం వినిపించేవారే ఓట్ల రాజకీయాలకు పాల్పడుతున్నపుడు ఇక సైద్ధాంతిక విధానం ఎక్కడుంటుంది! ఒక్క నీలం సంజీవరెడ్డి (1977) మినహా రాష్ట్రపతి ఎన్నికల చరిత్రలో ఏకగ్రీవంగా ఎన్నికైనవారే ఇంతవరకు లేకపోయారు. అన్నిటా కనిపించే ఓట్ల రాజకీయమే రాష్ట్రపతి ఎన్నికలోనూ కనిపించడం విచారకరమనే చెప్పాలి.




కవర్ స్టోరీ

పెట్ల వెంకటేశం

**మనకున్న నీటి వనరుల్లో ప్రధానమైనవి నదులు. ప్రాణికోటికి ప్రాణధారలందిస్తాయి కాబట్టే నదుల్ని నదీమ తల్లులుగా సంభావించు కోవటం జరుగుతోంది. స్వచ్ఛ జలాలతో గలగల పారవలసిన నదులు కాలుష్య కూపాలుగా మారి, వాడుకనీరుగా కూడా పనికి రాని స్థితి ఏర్పడుతోంది. అందులోని జలచరాలకు సైతం ప్రాణహాని కలిగించేంతగా నీటి పరిస్థితి నానాటికీ దిగజారటం ఆందోళన కలిగించే అంశం. మనదేశంలో అతిపవిత్రంగా భావించే గంగానది, అనేకానేక వ్యర్థాల చేరికతో కాలుష్య గంగగా మారిపోయింది. పాపాలు పోగొడుతుందని అనేకులు నమ్మే పావనగంగకే కల్మషాలు చేర్చిన ఘనత మనది. గంగాశుద్ధికోసం ఎన్నోసంవత్సరాలుగా ఎన్నో వేలకోట్ల రూపాయలతో ప్రక్షాళన కార్యక్రమాలు చేపట్టినా ఇంకా స్వచ్ఛ గంగావతరణ జరగలేదు. ఒక్క గంగ మాత్రమే కాదు, యమున, కావేరి, తుంగభద్ర మొదలైననదులు సైతం కాలుష్యం బారిన పడి కళను కోల్పోయాయి. నదుల కాలుష్యం, కారణాలు, జలశుద్ధికి చేపట్టిన కార్యక్రమాలు, ప్రక్షాళన తీరు తెన్నులు, నదులను తక్షణం రక్షించుకోవలసిన బాధ్యత వగైరా అంశాల సమాహార కథనం ఈవారం మీకోసం.**

నదుల కాలుష్యాన్ని నివారించడానికి కేంద్ర ప్రభుత్వం భగీరథ ప్రయత్నం చేస్తోంది. గంగ, యుమున నదుల శుద్ధికి గత ప్రభుత్వాలు కొన్ని వేలకోట్ల రూపాయలతో ప్రణాళికలు చేపట్టినా అవన్నీ బూడిదలో పోసిన పన్నీరయ్యాయి. ఇంతవరకు ఖర్చయిన కొన్ని వందలకోట్లకు జమాలెక్క లేకుండా పోయింది. గంగానది ప్రక్షాళనకు 20వేల కోట్ల రూపాయల అంచనా వ్యయంతో 2014లో 'నమామి గంగ' ప్రాజెక్టుకు మోడీ ప్రభుత్వం శ్రీకారం చుట్టింది. అంతకు ముందు 28 ఏళ్లుగా గంగా ప్రక్షాళనం గత ప్రభుత్వాలు తమ అజెండా లో కీలకాంశంగా పేర్కొన్నా చివరకు మిగిలింది శూన్యం. గంగా కార్యాచరణ పథకాన్ని యుపిఎ ప్రభుత్వం తలపెట్టింది. వేలకోట్ల రూపాయలు వెచ్చించింది. అయినా విషకాలుష్యాల ఊబినుంచి గంగను కాపాడలేకపోయాయని ఆనాడు కాగ్ ఆక్షేపించింది. గంగానది లోయలో రోజుకు 3987 మిలియన్ లీటర్ల మురుగునీరు ఇతర వ్యర్థాలు పేరుకుపోతున్నాయి. ఇతర నదులను పరిశీలిస్తే రోజూ 32,655 మిలియన్ లీటర్ల కలుషిత నీరు, వ్యర్థాలు చేరుతున్నాయని కేంద్ర కాలుష్య నియంత్రణ మండలి 2015లోనే వెల్లడించింది. 2014 అక్టోబరులో స్వచ్ఛభారత్ కార్యక్రమం ప్రారంభించిన తరువాత గంగా నది తీరాన ఉన్న 1,80, 000 గ్రామాలను బహిరంగ మలవిసర్జన రహితంగా తీర్చిదిద్దడమైందని సాక్షాత్తు ప్రధాని మోడీయే ప్రకటించడం గమనార్హం. ఈ గంగాయమున నదీజలాల ప్రక్షాళనే ప్రథమ కర్తవ్యంగా కేంద్రం ముందడుగు వేస్తున్న సందర్భంగా ఆ నదులు రెండూ ప్రాణమున్న చట్టబద్ధ జీవులని ఉత్తరాఖండ్ ఉన్నత న్యాయస్థానం తీర్పుఇవ్వడం చారిత్రాత్మకం. చట్టబద్ధ తల్లిదండ్రులుగా ఉత్తరాఖండ్ ప్రభుత్వ ప్రధానకార్యదర్శి, అడ్వకేట్ జనరల్ వ్యవహరిస్తూ ఆ నదుల సంరక్షణకు, ప్రక్షాళనకు బాధ్యత వహించాలని వ్యక్తిగతంగా బాధ్యతలు అప్పగించడం మరీ విశేషం.




ఇదేవిధంగా న్యూజిలాండ్ ప్రభుత్వం ఆ దేశంలోని వాంగానోయి నదికి చట్టబద్ధంగా వ్యక్తి హోదా కల్పిస్తూ కొన్నాళ్ల క్రితం చట్టం అమలులోకి తేవడం ఈ సందర్భంగా ప్రస్తావించవలసి ఉంటుంది. అదే ఉత్తరాఖండ్ ప్రభుత్వానికి స్ఫూర్తిదాయకమయింది. జలవనరుల నిర్వహణలో ఇంగ్లాండ్, అమెరికా దేశాలు సత్ఫలితాలు సాధించాయి. ఇంగ్లండ్‌లోని థేమ్స్ నది, గంగానది కన్నా దుర్గంధ పూరితమై కాలకూట విషంకన్నా ఘోరంగా ఉండేది. కానీ ఎడతెగని ప్రయత్నాల వల్ల స్వచ్ఛమైన నీటిని తిరిగి పొందగలిగింది. 1972లో అమెరికా శుద్ధజల చట్టం అమలులోకి వచ్చిన తరువాత పారిశ్రామిక, ఇతర వ్యర్థాలు నదుల్లో చేరకుండా కట్టడిచేయగలిగారు. పదేళ్లలో నదులన్నీ కాలుష్య రహితంగా ప్రవహించేలా పట్టుదల సాగించారు. రైన్ నది ఆరుదేశాల మీదుగా, డాన్యూబ్ నది 19 దేశాల మీదుగా ప్రవహిస్తుంటాయి. ఈ నదులకు జీవం పోయడంలో ఐరోపా సాగించిన ప్రయత్నం ఆదర్శనీయం.

ఉత్తర భారతంలో కొన్నికోట్లమందికి జీవనాధారంగా, ఆరాధ్య పవిత్రజలంగా, ఉన్న గంగానదిలో పారిశ్రామిక కట్టడాలు, ఇతర వ్యర్థాలు చేరి నది ఉనికినే ప్రశ్నార్థకంగా మార్చనున్నాయి. గంగా జలాల శుద్ధికోసం ప్రణాళిక మొదటి దశ ప్రారంభమయింది. 452 కోట్లతో అయిదేళ్లలో శుద్ధిచేయాలని సంకల్పించారు. 2000 మార్చిలో మొదటి దశ పూర్తయింది. మొదటి దశ పనులు సాగుతుండగానే 1993లో రెండోదశ పనులు ప్రారంభమయ్యాయి. ఉత్తరాఖండ్, ఉత్తరప్రదేశ్, జార్ఖండ్, బీహార్, పశ్చిమబెంగాల్ రాష్ట్రాల్లో గంగా తీరానికి ఆనుకుని ఉన్న 59 పట్టణాల్లో 319 శుద్ధికార్యక్రమాలు చేపట్టాయి. వీటిలో 200 కార్యక్రమాలు పూర్తయ్యాయని లెక్కలు చెబుతున్నాయి. తరువాత గంగా ప్రక్షాళన ప్రణాళిక రెండోదశను జాతీయ నదుల సంరక్షణ సంస్థ (ఎన్ఆర్‌సిపి)లో విలీనం చేశారు. 20 రాష్ట్రాల్లో 36 నదులను శుద్ధిచేయాలని ప్రతిపాదించారు. కానీ ఈ పథకాలన్నీ సరైన ప్రణాళిక, వ్యూహం లోపించి బూడిదలో పోసిన పన్నీరయ్యాయి. గత ఇరవై ఏళ్లలో గంగ శుద్ధికోసం గంగా కార్యాచరణ ప్రణాళిక కింద 1100 కోట్లు ఖర్చయినట్టు అధికారిక అంచనా ఉన్నప్పటికీ వాస్తవానికి ఆ వ్యయం 20,000 కోట్లకు పైగా ఉంటుందని నిపుణులు అభిప్రాయపడుతున్నారు. గంగ, యమున ..వివిధ నదుల శుద్ధికోసం ఇప్పటికే 17,000కోట్లు ఖర్చయినా అనుకున్న లక్ష్యం సాధించలేకపోయామని సాక్షాత్తు ప్రభుత్వమే పార్లమెంటు సాక్షిగా అంగీకరించడం గమనించదగిన అంశం. ఇంతవరకు ఏదెలా జరిగినా 2020 నాటికి గంగను శుద్ధి చేయడం జరుగుతుందని స్పష్టంచేయడమే కాదు, మరో పథకంతో ముందడుగు వేస్తోంది. దీనికోసం 15,000కోట్లు కేటాయించింది. ప్రపంచ బ్యాంకు నుంచి 100 కోట్లు డాలర్ల రుణం తెస్తోంది. గంగానది ప్రక్షాళన కోసం కేటాయించిన కోట్ల నిధుల్లో అత్యధిక శాతం దుర్వినియోగమయ్యాయన్నది వాస్తవం. ఇందులో తిలాపాపం తలా పిడికెడు అన్నట్టు సంబంధిత రాష్ట్ర ప్రభుత్వాల వంతు కూడా ఉంది. నిధులు ఎలా పక్కదారి పట్టాయో నిగ్గు తేల్చ గలిగితేనే మున్ముందు వెచ్చించనున్న కోట్ల నిధులు సార్థకమవుతాయి.



## కాలుష్యమయమైన యమున...

యమునా లేదా జమున అనే పేరుతో సార్థకమయ్యే నది భారతీయులకు ఎంతో పవిత్రమైనది. షాజహాన్ యమునానది ఒడ్డునే తాజ్‌మహల్ కట్టించాడు. భారతీయుల్లో ఉండే సనాతన సౌభ్రాతృత్వాన్ని 'గంగా-యమునా తెహజీబ్' అంటారు. యమున సూర్యదేవుని పుత్రిక అని, యముడి సోదరి అని అందువల్ల యమునలో స్నానం ఆచరిస్తే అకాల మృత్యుదోషం హరిస్తుందని పౌరాణిక వాదుల నమ్మకం. కానీ యమునానది స్వరూపం పరిశీలిస్తే పూర్తిగా కాలుష్యకూపం.

హిమాలయ పర్వతశ్రేణుల్లో యమునోత్రిలో యమున పుట్టింది. ఉత్తరాఖండ్, హిమాచలప్రదేశ్, హర్యానా, ఉత్తర ప్రదేశ్, ఢిల్లీ మీదుగా ప్రవహిస్తుంది. నేరుగా సముద్రంలో కలియకుండా త్రివేణి సంగమంతో తిరిగి గంగానదిలోనే విలీనం అవుతుంది. యమునా నదీ పరివాహకప్రాంతాల్లో యమునానగర్, ఢిల్లీ, మధుర, ఆగ్రా, ఇటావా, అలహాబాద్ నగరాలు ఉన్నాయి. ఈ నగరాల కాలుష్యం యమునానదిని అత్యంత కాలుష్యమైన నదిగా మారుస్తోంది. ఇది ఢిల్లీలో 22 కి.మీ.మేర ప్రవహిస్తుంది. ఢిల్లీ నగర ప్రజల వాడుక నీరు, మలమూత్రాలు అన్నీ యమునలోనే కలుస్తాయి. ఢిల్లీలో ప్రవేశించే యమునా నది ప్రవాహాన్ని వశీరాబాద్ బ్యారేజి వద్ద ఆపేసి నీటిని నిల్వచేస్తారు. అక్కడనుంచి చుక్కనీరు కూడా రాదు. దీన్ని బట్టి ఢిల్లీలో ప్రవహించే యమున అంతా ఢిల్లీ ప్రజల మురుగునీరే. గంగానది రీతిలో యుమునా నదిని కూడా ప్రక్షాళన చేయాలన్న డిమాండ్ ఎప్పటినుంచో ఉంది. బిజెపి ప్రభుత్వం ఈమేరకు సన్నాహాలు చేస్తోంది. ఢిల్లీలోని ఆప్ పార్టీ ప్రభుత్వం యమున శుద్ధిని మూడేళ్లలో పూర్తిచేస్తామని చెప్పినా ఎలాంటి ప్రణాళికలు ప్రత్యేకించి చేపట్టలేదు. యమునా పరీవాహక ప్రాంతాలకు సమీపాన పండే ఆకుకూరలు, కూరగాయలు, క్యాన్సర్ కారకాలని పరీక్షల్లో తేలింది. యుమున విషజలాల కారణంగానే పరిసర గ్రామాల భూగర్భజలాలు విషపూరితమవుతున్నాయి. కీళ్లనొప్పులు, తదితర అనారోగ్య సమస్యలు వెంటాడుతున్నాయి.

యమునానది చిన్న డ్రయినేజి కాలువలా కుదించుకుపోయింది. సీవరేజి, రసాయనాలు, బయోమెడికల్, ఇళ్లలోని వాడుకనీరు తదితర వ్యర్థ జలాలు అన్నీ యమునలోనే చేరుతున్నాయి. 201 స్టార్మ్ వాటర్ డ్రెయిన్లు, 22 ఇతర మురికికాలువల ముఖద్వారాలతో కలిసి యమున వైపు మళ్లుతున్నాయి. సీవేజి, పారిశ్రామిక కలుషిత నీరు ఇవన్నీ యమున ప్రయాణాన్నే మార్చివేస్తున్నాయి. యమున శుద్ధికోసం 1500 కోట్లకన్నా ఎక్కువ ధారపోసినా పరిస్థితి యథాతథమే. నీటిలో కరిగిన ఆక్సిజన్ సరాసరిన 4 పాయింట్ల కన్నా ఎక్కువ ప్రమాణం ఉండాల్సి ఉండగా జీరో కావడం గమనార్హం. బయొలాజికల్ ఆక్సిజన్ డిమాండ్ 3 కన్నా తక్కువ కావలసి ఉండగా 35 వరకు ఉంది. హానికరమైన బాక్టీరియా కోలి 500 కన్నా ఎక్కువ ఉండకూడదు. కానీ మిలియన్ల వరకు ఉంది. ఈకారణంగానే దోమల స్థావరంగా యమున ప్రసిద్ధికెక్కుతోంది. గత అయిదేళ్లలో డెంగ్యూ కేసులు ఎనిమిది రెట్లు కలరా కేసులు 7 రెట్లు పెరిగాయి. దీనికి నేషనల్ గ్రీన్ ట్రిబ్యునల్ ఆవేదన చెంది ఎవరైనా వ్యక్తులు యమునలో వ్యర్థాలు కలిపినా, పూజా సామాగ్రి వంటివి పారబోసినా 5000 రూపాయలు జరిమానా విధించినా ఆగడంలేదు.

## కావేరి, తుంగభద్ర..

కర్ణాటకలోని ముఖ్యమైన నదులు కావేరి, తుంగభద్ర కాలుష్య కాసారాలుగా వర్ధిల్లుతున్నాయి. కావేరీ 3 రాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతం పుదుచ్చేరి మీదుగా ప్రవహిస్తుంది. ఈ నదుల తీరాలు దుర్వినియోగం కావడమేకాక పశ్చిమ కనుమల్లో వీటి ఉనికికే ముప్పు కలిగిస్తున్నాయి. అత్యధిక వర్షపాతం కర్ణాటకలో ఉన్నప్పటికి నదుల మనుగడ సాగడంలేదు. గత కొన్నేళ్లుగా వర్షాలు బాగా పడినా నదీపరివాహక ప్రాంతాల్లో అనేక తటాకాలు దుర్భిక్షానికి గువుతున్నాయి. తాజాగా నీరు వచ్చి నదిలో చేరే అవకాశం లేకుండాపోయింది. పారిశ్రామిక వ్యర్థాలే నదిని పూర్తిగా ముంచేస్తున్నాయి.

2020 నాటికి బెంగళూరు నివాసయోగ్యం కానిదవుతుందని రెండేళ్ల క్రితం పరిశోధకుడు టివి రామచంద్ర హెచ్చరించారు. సాటి పరిశోధకులు ఈ హెచ్చరిక ఒక్కటే చాలదని 2020 నాటికి బెంగళూరు విధ్వంసాన్ని ముందుగానే గమనించాల్సిన అవసరం, అప్రమత్తత ముఖ్యమని పేర్కొన్నాయి. కర్ణాటకలోని నదీ ప్రాంతాల నివాసాల పరిస్థితి కూడా ఇంచుమించు ఇలాగే కనిపిస్తోంది. హంపీ క్షేత్రం మీదుగా కొప్పల్, బళ్లారి జిల్లాలను వేరుచేస్తూ తుంగభద్రలో కొంతభాగం ప్రవహిస్తోంది. ఈ ప్రాంతాన్ని జలచర సంరక్షక కేంద్రంగా దేశంలో మొట్టమొదటిసారి ప్రకటించారు. 34 కి.మీ.

పొడుగునా నదీ ప్రాంతాన్ని జలచర సంరక్షక కేంద్రంగా పరిగణించారు. అయితే ఈ జలచర సంఖ్య క్రమేణా తగ్గిపోతోంది. డెక్కన్ కన్సర్వేషన్ ఫౌండేషన్ వ్యవస్థాపకుడు ఇంద్రజిత్ ఘోర్పడే ఈ సంరక్షకకార్యాన్ని సక్రమంగా నిర్వహించి, తగిన సమగ్ర కార్యాచరణ ప్రణాళిక అవసరమని సూచించారు. రెండు కరువుపీడిత జిల్లాలకు ఈనది జీవస్రవంతి. ఈ నదీజలాల నాణ్యత కాపాడవలసిన కర్తవ్యం అందరిది. ఈ నీటిని ఈ నీటి మొక్కలను అలంకరణలకు, ఫర్నిచర్ తయారీకి వినియోగించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ప్రస్తుతం ఈ తుంగభద్ర నదీజలాల స్వచ్ఛత, నాణ్యత తిరిగి చేకూరేలా తుంగభద్ర బోర్డు, హంపి వరల్డ్ హెరిటేజి, ఏరియా మేనేజిమెంట్ అథారిటీ కొప్పల్, బళ్లారి జిల్లాల యంత్రాంగం, ఆదోని విభాగాలు కృషిచేస్తున్నాయి.



**వృషభవతి నది..**

ఉపనదులు వృషభవతి, అర్కవతి నదుల తీరప్రాంతాలు, నదీ జలాలు, కాలుష్యపూరితమయ్యాయి. ఇవన్నీ కావేరిలో కలిసే నదులు. ఇళ్లవాడుక నీరు, ఆస్పత్రులు, పరిశ్రమల వ్యర్థాలు ఇవన్నీ నదీతీర ప్రాంతాల్లో చేరిపోతున్నాయి. స్థానిక పాలనా యంత్రాంగాలు ఈ వ్యర్థాలను అరికట్టడంలో విఫలమవుతున్నాయి. ఒకప్పుడు వృషభవతి నది నీటిని ప్రజలు మంచినీటిగా వినియోగించేవారు. కానీ ఇప్పుడు మురుగు కాలువగా మారింది. నందికొండల్లో పుట్టిన వృషభవతి, అర్కవతిని కలుస్తుంది. ఈరెండు ఉపనదులు చివరకు కావేరిలో కలుస్తాయి. బెంగళూరు నగర ప్రజలకు ఈ జలాలే ఆధారంగా ఉండేవి. 1935లో తిప్పగొండన హళ్లి రిజర్వాయర్‌ను నిర్మించే కాలంలో వృషభవతి, అర్కవతి జలాలే అన్నిటికీ, అందరికీ ఆధారంగా ఉండేవి. అర్కవతి నదీలోయ పూర్తిగా ఎండిపోయిందని అణిక ట్రస్ట్ పర్యావరణ అధ్యయనం బయటపెట్టింది. భూగర్భ జలాలను విపరీతంగా తోడివేయడంతో అత్యధికంగా నీటిని పీల్చుకునే యూకలిప్టస్ (నీలగిరి) చెట్లను పెంచడంతో నీటికి కరవు ఏర్పడుతోంది. వృషభవతి నదీజలాలు, కావేరీ జలాల స్వచ్ఛత నాణ్యత దెబ్బతినకపోయినా, వృషభవతికి అనుసంధానంగా ఉన్న చెరువులు కలుషితం కావడంతో వృషభవతితోపాటు కావేరీ జలాలు కూడా కలుషితమవుతున్నాయి. కబిని అనే ఉపనది ప్రభావం కూడా కావేరీని కలుషితం చేస్తోంది. కబిని నదిలో కోలిఫారం బాక్టీరియా చాలా ఎక్కువగా విస్తరించిందని మైసూరు శ్రీ జయ చామ రాజేంద్ర ఇంజినీరింగ్ కాలేజీ అధ్యయనంలో తేలింది. 100 మి.లీ.నీటిలో 1000 నుంచి 1600 స్థాయిలో కోలిఫారం బాక్టీరియా 1999లో ఉండగా, 2013 నాటికి ఈ బాక్టీరియా స్థాయి 6000కి చేరింది. కొడగు జిల్లా కాలుష్య నియంత్రణ మండలి అధికారి గణేశన్ కావేరీజలాల స్థితిని వివరిస్తూ ఇప్పుడు కావేరీ జలాలను నేరుగా వినియోగించే పరిస్థితి లేదన్నారు. కొన్నేళ్ల క్రితం వరకు కావేరీజలాలు స్వచ్ఛంగా ఉండేవన్నారు. మరో గంగానదిలా కావేరీ కాలుష్య వాహినిలా తయారైందని పర్యావరణ ఉద్యమనేత ఎం.ఎన్. చంద్రమోహన్ పేర్కొన్నారు.

**తుంగభద్రలో తూటికాడ, గుర్రపుడెక్కలు...**

కలుషిత జలాలతోపాటు తుంగభద్రలో తూటికాడ, గుర్రపుడెక్కవంటి కలుపుమొక్కల తీగలు దట్టంగా విస్తరించిపోయాయి. దీనివల్ల కొత్తగా నదిలోకి నీరు వచ్చినా నీరు నిలిచి ఉండడం లేదు. ప్రవాహం సాగడం లేదు. పర్యావరణానికి తగ్గట్టు జలచరాలు మనుగడ సాగించలేకపోతున్నాయి. గత మూడేళ్లనుంచి తుంగభద్ర డ్యామ్‌నుంచి నీటిప్రవాహం లేకుండాపోతోందని ఆనెగొందికి చెందిన శర్మ పవార్ చెప్పారు. ఇదివరకు డ్యామ్ గేట్లు తెరిచేటప్పుడు ఆ నీటి ప్రవాహానికి కలుపుమొక్కలు కొట్టుకుపోయేవి. కానీ ఇప్పుడు డ్యామ్ ప్రవాహం తగ్గి దుర్భిక్ష పరిస్థితులు తలెత్తడంతో నీటిలో కలుపు మొక్కలు దట్టంగా పేరుకుపోయాయి. దీనివల్ల హంపి, ఆనెగొంది ప్రజలకు అనారోగ్య వాతావరణం దాపురిస్తోంది. నదుల పరిసరాల్లో ఉన్న వ్యవసాయ భూముల్లో క్రిమిసంహారక మందుల వినియోగం,

# నదీ ప్రవాహప్రాంతాలకు భద్రత ఎక్కడ?



గంగ, యమున, గోదావరి, కృష్ణ, తుంగభద్ర, కావేరి ఈ నదుల పరీవాహక ప్రాంతాల్లోనే నాగరికత విలసిల్లింది. అయితే ఆధునికత విస్తరించి జనజీవనంలో మార్పు వస్తున్న కొద్దీ నదీ పరివాహక ప్రాంతాలు కుదించుకుపోతున్నాయి. ఆక్రమణలకు గురవుతున్నాయి. వర్షాలు కురిస్తే వరదనీరు నదుల్లోకి వెళ్లలేక పరిసర ప్రాంతాలను ముంచివేస్తోంది. జననష్టం, ఆస్తుల నష్టం కొన్నివేల కోట్ల రూపాయల నష్టం సంభవిస్తోంది. ఈ ఉపద్రవాలను ఎదుర్కోడానికి, నదులను వెంటాడుతోన్న కాలుష్య భూతాన్ని తరిమికొట్టడానికి కేంద్ర ప్రభుత్వం 2002లో నదీ నియంత్రణ మండల (ఆర్ఆర్‌జెడ్) విధానాన్ని రూపొందించింది. 2016లో ఆర్ఆర్‌జెడ్ ముసాయిదా ఖరారైంది. వర్షాకాలంలో వరద ప్రవాహాలు ఎలాంటి అడ్డంకి లేకుండా సాగాలంటే నదికి అటు ఇటు ఖాళీ భూమి తగినంతగా ఉండాలి. ఈ ఖాళీ భూముల్లో జీవ వైవిధ్యభరితమైన వనాలు, జంతు సంతతి, మత్స్య సంపద అభివృద్ధి చెందడానికి వీలవుతుంది. ప్రతినదికి 100 సంవత్సరాలకు ఒకసారి అత్యధిక స్థాయిలో వరదలు రావచ్చు. ఆ సమయంలో నది మొత్తం ప్రవాహ విస్తీర్ణాన్ని వరదభూమిగా వర్గీకరిస్తారు. అయితే నదులపై ఆనకట్టలు, ప్రాజెక్టులు నిర్మించాక వరదల భయం తగ్గింది. దాంతో నదుల ప్రవాహ ఖాళీ ప్రదేశాల్లో నిర్మాణాలు పుట్టుకొచ్చాయి. రానురాను ఇవి పెరగడంతో ప్రమాదాలు వస్తున్నాయి. ఈ నేపథ్యంలో వరదలకు వంద సంవత్సరాలు కాకుండా 50 ఏళ్ల వరదనీటి మట్టాలను ప్రాతిపదికగా తీసుకోవాల్సిన అవసరం ఏర్పడింది. ఆర్ఆర్‌జెడ్ విధానం పాటించక తప్పనిసరి. దీని ప్రకారం 50 ఏళ్ల వరదరేఖలో నది భూముల్లో కాలుష్యం, కట్టడాలను నిరోధించాల్సి ఉంటుంది. ఇది పాటించకపోవడం వల్లనే యమున నది వరద భూముల్లో ఇష్టానుసారం నిర్మాణాలు జరిగాయి. అక్షర్‌ధామ్ ఆలయ నిర్మాణంతో అనేక నిర్మాణాలు ఊపందుకున్నాయి. యమున వరద ప్రాంతంలో 90 ఎకరాల్లో అక్షర్ ధామ్ ఆలయం నిర్మాణమయింది. ఆ తరువాత 157 ఎకరాల్లో కామన్ వెల్త్ క్రీడాగ్రామాన్ని, 50 ఎకరాల్లో ఢిల్లీ మిలీనియం బస్‌డిపోను నిర్మించారు. అక్షర్‌ధామ్ ఆలయ నిర్మాణానికి ఎన్డీఏ ప్రభుత్వం కామన్ వెల్త్ క్రీడా గ్రామానికి యుపిఎ ప్రభుత్వం అనుమతులు ఇచ్చాయి. నదుల భూముల్లో అక్రమ నిర్మాణాలు విస్తరిస్తూండడంతో స్వచ్ఛంద సంస్థలు, పౌర హక్కుల బృందాలు ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చి ఉద్యమాలను చేపట్టాయి. న్యాయపోరాటాలు సాగించాయి. ఈ పోరాటాల ఫలితంగానే అలహాబాద్ హైకోర్టు గంగా, యమునల గరిష్ట వరదరేఖకు 500 మీ. లోపల ఎలాంటి నిర్మాణాలు చేపట్టరాదని ఆదేశించింది. నిత్యం ప్రవహించే ఉపనదులు, ఏరులనుంచి 100మీ. దూరం వరకు అన్నిరకాల నిర్మాణాలను నిషేధించింది.

చిన్న, పెద్ద పరిశ్రమల నుంచి శుద్ధికాని కలుషిత నీరు వచ్చి నదుల్లోకి చేరడం, వ్యర్థాలు కుమ్మరించడం, ఇవన్నీ నదీజలాలను పాడుచేస్తున్నాయి.

## నేషనల్ గ్రీన్ ట్రిబ్యునల్ తీర్పు

గంగ కలుషితంకాకుండా నిర్మలంగా ఉంచడం మనందరి పవిత్ర బాధ్యత. ప్రభుత్వం, ప్రజల సమిష్టి బాధ్యత. గత రెండేళ్లలో గంగశుద్ధికి ప్రభుత్వం 7వేల కోట్ల రూపాయలకు పైగా ఖర్చు చేస్తున్నా అదింకా తీవ్రమైన పర్యావరణ సమస్యగానే మిగిలి ఉండడం తీరని ఆవేదన. అందువల్ల నదీతీరానికి 100మీ. పరిధిలో ఎలాంటి నిర్మాణాలు చేపట్టరాదని నిషేధించడమయింది' అని జాతీయ హరిత న్యాయస్థానం జూలై 14న (2017) స్పష్టీకరించింది.




'గంగాశుద్ధి అన్నది కేంద్ర, రాష్ట్ర, ప్రజల సమిష్టి కర్తవ్యం. రాజ్యాంగం ప్రకారం.. చట్టప్రకారం ఇది రాజ్యాంగ బద్ధం. గంగానదిని శుద్ధిచేయడం, పునరుజ్జీవింపచేయడం రాజ్యాంగ ధర్మం. సుప్రీంకోర్టు ఉత్తర్వులను కూడా పట్టించుకోకుండా గంగా కార్యాచరణ ప్రణాళిక మొదటి, రెండు దశలలో సమన్వయ సహకారంలేక పథకాలు అమలుకాలేదు. అవే చివరికి నది కాలుష్యానికి దారితీశాయి. జాతీయ ప్రాజెక్టు కింద అయిదేళ్లలో (2015-20) ప్రధాని దీనికి 20వేల కోట్ల రూపాయలు కేటాయించినా, మార్చి 2017 వరకు రూ.7304, 64కోట్లు ఖర్చుచేసినా గంగానది స్థితిలో మార్పురాలేదు. నీటిలో నిర్మలత్వం, నాణ్యత ఏర్పడలేదు.

నదీ తీరానికి 500 మీ. పరిధిలో వ్యర్థాలను కుమ్మరించడాన్ని ట్రిబ్యునల్ నిషేధించింది. దీనికి పాల్పడిన ప్రతి అపరాధి తన తప్పుకు 50వేల రూపాయల అపరాధ రుసుం చెల్లించాల్సి ఉంటుందే.



గంగానది, ఉపనదుల పరివాహక ప్రాంతంలో నెలకొన్న పరిశ్రమలు విచక్షణా రహితంగా భూగర్భజలాలను తోడరాదని, దీనిపై కేంద్ర భూగర్భ జల వ్యవస్థ అధ్యయనం చేయాలని, హరిద్వార్, ఉన్నావో మధ్య విచక్షణా రహితంగా భూగర్భజలాలను తోడివేస్తున్న, జటిలమయిన, అంత జటిలంకాని, సురక్షితమయిన జోన్లు ఏమిటో గుర్తించాలని ట్రిబ్యునల్ ఆదేశించింది. దీనికోసం పర్యవేక్షక కమిటీని జలవనరుల మంత్రిత్వ శాఖ కార్యదర్శి ఆధ్వర్యంలో నియమించింది. ఇందులో ఐఐటి ప్రొఫెసర్లు, అధికారులను కూడా ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం బాధ్యులను చేసి మార్గదర్శకాల అమలును పర్యవేక్షించాలని ట్రిబ్యునల్ సూచించింది.

సీవేజ్ ట్రీట్మెంటు ప్లాంట్లు, కాలుష్య నియంత్రణ సాధనాలు తదితర ఏర్పాట్లు 4 నెలల్లో పూర్తిచేసి శుద్ధిపనులు ప్రారంభించాలని, రెండేళ్లలో శుద్ధి పూర్తిచేయాలని ట్రిబ్యునల్ ఆదేశించింది. ఈ సందర్భంగా గంగానదీతీరం వెంబడి 500 మీ. పొడవునా శుద్ధి చేయడానికి 7వేల కోట్లకు పైగా ఖర్చుచేయడంపై ప్రఖ్యాత పర్యావరణ సామాజిక నేత, న్యాయవాది మెహ్రా ట్రిబ్యునల్ ఆదేశాలను స్వాగతించారు.

ఈ 7వేల కోట్ల ఖర్చుపై సిబిఐ దర్యాప్తు చేయించాలని డిమాండ్ చేశారు. ఈ తీర్పు పరిధిలోకి వచ్చే ప్రాజెక్టులన్నిటినీ నేషనల్ మిషన్ ఫర్ క్లీన్ గంగా (ఎన్ఎంసిసి) సమీక్షించాలని ఇందులో నిధుల లభ్యతకు అతీతంగా జలవనరుల మంత్రిత్వ శాఖ, ఎన్ఎమ్సిసి, సమిష్టి బాధ్యత వహించాలని అన్నారు.

కాన్పూర్లోని జాజ్మయి క్లస్టర్లోని తోళ్ల పరిశ్రమను తరలించడంపై లెదర్ యూనిట్లు, ఆరువారాల్లోగా కార్యాచరణ ప్రణాళిక రూపొందించాలని, విఫలమైతే ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం ఆ తోళ్ల శుద్ధి కర్మాగారాలను మూసివేయించాలని, వాటిని బందర్, ఉన్నావో లేదా మరేదైనా అభివృద్ధి ప్రాంతానికి తరలించాలని ట్రిబ్యునల్ ఆదేశించింది.

పర్వదినాల్లో ఈ నదీతీర ఘట్టాల్లో నిర్వర్తించే మత, ధార్మిక కార్యక్రమాలకు సంబంధించి మార్గదర్శకాలు రూపొందించాలని ఉత్తరప్రదేశ్, ఉత్తరాఖండ్ రాష్ట్రాలు ప్రభుత్వాలకు సూచించింది. నదీప్రవాహం కనీసం నెలవారీ 20 శాతానికి తగ్గకుండా చూడాలని, మున్సిపల్ వ్యర్థాలు ఘన, ద్రవ్యర్థాలు కానీ, ఇ-వ్యర్థాలు కానీ లేదా బయోమెడికల్ వ్యర్థాలు కానీ నదీప్రాంతంలో, నదిలో పడవేయకుండా చూడాలని సూచించింది. నదీతీరం నుంచి పరీవాహక ప్రాంతం నుంచి ఇసుక, కంకర తవ్వకాలు విచ్చలవిడిగా సాగకుండా చూడాలని, నదీప్రవాహానికి ఆటంకం కలగరాదని, తీరభూమిలో తవ్వకాలు అవసరమయితే అవి కూలి మనుషులకే అప్పగించాలి తప్ప యంత్రాలు ఉపయోగించరాదని, నదికి పొడుగునా, పక్కన తవ్వకాలు జరపరాదని, నది ప్రవాహానికి విఘాతం కలిగించరాదని పేర్కొంది. ఎంతయితే తవ్వకం జరిగిందో అంత తిరిగి ఏటేటా భర్తీ అయ్యేరీతిలో ఉండాలని సూచించింది.

సీవేజ్ ట్రీట్మెంట్ ప్లాంట్, కామన్ ఎఫ్లుయెంట్ ట్రీట్మెంట్ ప్లాంట్ తదితర నిర్మాణాలకు అయ్యే వ్యయంలో 25శాతం ఎక్కువగా పరిశ్రమలు తప్పనిసరిగా ఆర్థిక సహకారం అందించాలని, తీర్పు ప్రకారం ఈ ప్రాజెక్టులు పని ప్రారంభించాలని సూచించింది.

గంగశుద్ధికి సంబంధించి ఏ ప్రాజెక్టు కయినా ఉత్తరాఖండ్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలు గోముఖ్ నుంచి ఉన్నావో మధ్య సెగ్మెంట్లో ఎన్ఎంసిసి లేదా ఇతర ఆర్థిక నిధులను వెచ్చించే మంత్రిత్వశాఖ ఎలాంటి నిధులు వెచ్చించరాదని సూచించింది.

తొలిదశ గంగానది ప్రక్షాళన కార్యాచరణ ప్రణాళిక 1986లో ప్రారంభించినపుడు 949 కోట్లు, రెండవదశలో 279 కోట్లు 1993లో వెచ్చించినా గంగానది నీటిలో ఎలాంటి నిర్మలత్వం, స్వచ్ఛత ఏర్పడలేదని గుర్తుచేసింది. గంగా కార్యాచరణ ప్రణాళిక తొలిదశ 1986లోచేపట్టినపుడు ఉత్తరప్రదేశ్, బీహార్, పశ్చిమబెంగాల్ రాష్ట్రాల్లో గంగానదీ తీరం ఆనుకుని ఉన్న 25 పట్టణాలను ఎంపిక చేశారు. 1993లో రెండవదశ ప్రారంభమైంది. ఇదే ప్రణాళికను కొనసాగిస్తూ యమున, దామోదర్, మహానది నదులను కూడా ఇందులో చేర్చారు.

ఏది ఏమైనా ప్రాణాధార నీటి వనరులైన నదులను కాలుష్య కోరలనుంచి రక్షించి, వాటికి తిరిగి జవజీవాలు చేకూర్చాలి. ప్రజలు సైతం నదుల పరిరక్షణకు పాటుపడుతూ, నదులను పదిలంగా చూసుకోవాలి.

# తెలుగు కవితకు వెలుగు నిచ్చిన కవి!

## ఆగస్టు 4 కరుణశ్రీ జయంతి

పుష్ప విలాపం, కుంతీకుమారి వంటి పద్యరత్నకావ్యాలను రచించి, తెలుగు వారి మనసుల్లో మధురకవిగా చెరగని ముద్రవేసిన కవి జంధ్యాల పాపయ్యశాస్త్రి. కరుణశ్రీ, ఉదయశ్రీ వంటి పద్య కావ్యాలను రాసి కలంపేరు 'కరుణశ్రీ'గా చేసుకున్నారాయన. జంధ్యాల పాపయ్యశాస్త్రి గుంటూరుజిల్లా కొప్పర్రులో మహాలక్ష్మి, పరమేశ్వరులు అనే దంపతులకు 1912లో ఆగస్టు 4వ తేదీన జన్మించారు. వీరి కవితా గురువు కుప్పా ఆంజనేయశాస్త్రిగారు. కుప్పావారు కరుణశ్రీ కవితాలతకు ఊపిరులూది, వెన్నుతట్టి ప్రోత్సహించారు. కరుణశ్రీ 1942లో గుంటూరులోని ఆంధ్రా క్రిస్టియన్ కళాశాలలో తెలుగు ఉపన్యాసకులుగా చేరి మూడు దశాబ్దాలపాటు పనిచేశారు. ఆయన పాఠం వినాలనే ఆసక్తితో క్లాసులోని మొదటి బెంచిలో కూర్చునేందుకు విద్యార్థులు పరుగులు పెట్టేవారని చెబుతుండేవారు.

1942లోనే శాస్త్రిగారు 'పుష్పవిలాపం' ఖండికరాస్తే ఆ సంవత్సర వార్షిక సంచికలో ప్రచురితమైంది. శాస్త్రిగారి కలంబలం విద్యార్థులకు తెలిసింది. అంతే అభినందనల వర్షం కురిపించారు. ఆయనకు అప్పుడైన ఎ.ఎస్. కృష్ణ స్నేహితుడి కవిత్వం చూసి 'ఒరేయ్! నువ్వు కవిత్వం కూడా రాస్తావా. మరి నాకు చెప్పలేదే, రాసిన పద్యాల్ని పుస్తకంగా అచ్చువేయించు, ఇదిగో వెయ్యి' అంటూ పది పచ్చనోట్లు ఆయన చేతిలో పెట్టినట్లు శాస్త్రిగారే చెబుతుండేవారు. ఆయన కలం నుంచి వెలువడ్డ 'పుష్ప విలాపం', 'కుంతీ కుమారి', పద్యాల్ని గానం చేసిన కారణంగా ఆంధ్ర దేశానికి ఘంటసాల వెంకటేశ్వరరావు వంటి అమర గాయకుడు లభించినట్లయింది. 1944 లో మరో మిత్రుడి సహకారంతో జంధ్యాల వారి 'ఉదయశ్రీ' కావ్యం ముద్రణకు నోచుకుంది.



పాపయ్యశాస్త్రిగారు విజయశ్రీ, కరుణశ్రీ, అరుణ కిరణాలు, కల్యాణ కల్పవల్లి, భారత ప్రతిభ, కల్యాణ కాదంబరి, తెలగు సీమ, కరుణామయి (నాటిక), ముద్దు బాలశిక్ష- వంటి పలు గ్రంథాలు రచించారు. పూలను గురించి వారు 'పుష్ప విలాపం'లో పూలు కోస్తూ ఉంటే అవి జాలిగా నోళ్లు విప్పినాయని, కరుణ రసాప్లావితంగా చురకలు అంటించారు. అవే తనచేత పుష్ప విలాప కావ్యం రాయించడానికి నాంది పల్కినాయని ఆయన చెప్పారు. స్త్రీలు, పూలను దండలుగా గుచ్చడంపై ఒకచోట ' ఊలు దారాలతో గొంతుకురిబిగించి/ గుండెలో నుండి సూదులు గుచ్చి, కూర్చి..' అని గమ్మత్తుగా ఎద్దేవా చేస్తారు. గుంటూరు శేషేంద్ర శర్మ వంటి కవి కూడా 'కరుణ శ్రీ'ని భావకవితాయుగపు సంధ్యాకిరణంగా పోల్చి చెప్పడం ఆయన గొప్పదనానికి నిదర్శనంగా భావించాలి. జంధ్యాల వారి కవితా ఖండికలన్నిటిలో 'కుంతీకుమారి' పేరెన్నిక గన్నదిగా కొందరు అభివర్ణిస్తుంటారు. దీనిలో సూర్యభగవానుని అనుగ్రహం వల్ల జన్మించిన కర్ణుని వృత్తాంతం జగద్విదితమైనదిగదా. కవి తన ప్రతిభా వ్యుత్పత్తులను రంగరించి కుంతీకుమారి రూపాన్ని, పరిసరాలను అక్షరీకరించిన తీరు ఇలా..

అది రమణీయ పుష్పవనమా వనమందొక మేడపై
నదియొక మారుమూల గది, ఆ గది తల్పులు తీసి మెల్లగా
పదునయిదేండ్ల యీడుగల బాలిక పోలిక రాచపిల్ల జం
కొదవెడి కాళ్లతోడ దిగుచున్నది క్రిందికి మెట్లు మీదుగన్....,

ఆమె (కుంతీకుమారి) వెళ్లింది, బాలభానుణ్ణి పిలిచింది, కుమారిగా ఉన్న ఆమె కోరికను మన్నించాడు ప్రత్యక్ష నారాయణుడు. అనంతర పరిణామంగా కన్యగానే ఒక తనయుణ్ణి పొందినందుకు కుంతి చింతించింది. అవివాహితగా ఆ బిడ్డని తన దగ్గర ఉంచుకోలేక గంగానది ఒడిలో బిడ్డడిని వదిలేయడానికి పూనుకొని, గంగ చెంతకుచేరింది. కన్న మమకారమొకపక్క, మరోపక్క మాతృత్వం పెల్లుబికి ఆ బిడ్డని రొమ్ముకు అదుముకున్నది. మనసులో ఆవేదన బయలుదేరగా తల పైకి ఎత్తినది. 'చూడ నీవే సాక్షి..' అన్నట్లు ఆమె చూపులు నింగికి తాకాయి' అని జంధ్యాలవారి వర్ణన ఆర్ద్రంగా సాగుతుంది. ఇక్కడ గమనించాల్సింది, తాను భోగభాగ్యాలతో తులతూగుతున్నా, ఆమెకి బాధలు, వ్యథలు తప్పలేదని ఈ సన్నివేశం ద్వారా పాఠకులు గ్రహించగలుగుతారు.

కరుణశ్రీ 'ఉదయశ్రీ' ఖండకావ్య సంపుటిలో ప్రతి కవితతో నవతకు నాంది పలికారనడా నికి ఉదాహ రణగా నిలుస్తుంది. వారి అంతరంగ కవితా తరంగాలు ఉవ్వెత్తున ఎగసి కవితాలతలు పైపైకి సాగాయి. ఇక ఉదయశ్రీ పద్యాలలో..

శ్రీకరమ్ములు మీకు నాట్యైకలోల
శివజటాజూట గాంగేయ శీకరములు
రంజితమ్ములు మీకు శర్వాణి చరణ
కంజ మంజుల మంజీర శింజితములు'

అంటారు. చక్కని,చిక్కని భాషా పేశలం ఈ పద్యంలో గోచరిస్తుంది. నండూరి కృష్ణమాచార్యులు వంటి కవి పండితులు కరుణశ్రీపద్యాల గురించి ఒక చోట ఇలా అంటారు.. 'నన్నయ్య వృత్తరచనలోని గంభీర గమనం, సంస్కృత సమాసాలలోని సారళ్యం, మాధుర్యాలు, 'తిక్కన' సజీవ పదప్రయోగంలోని గరువతనం, శ్రీనాథుని సీసాలలోని ఉయ్యాల తూగు, పోతన పద్యాలలోని మందార మకరంద మాధుర్యం, దాక్షిణాత్య కవుల కమ్మని తెలుగు పలుకుబడులు, రాశీభూతమైన పాపయ్యశాస్త్రి గారి కవిత్వంలో ఎడనెడ సాక్షాత్కరిస్తాయి' అని. ఇంతకన్నా కితాబు వేరే ఏంకావాలి చెప్పండి. ఆయన ఉదయశ్రీ కావ్యం పాఠకుల్ని రంజింప జేయడంతో పాటు, ఇతోధిక యశశ్రీ సంవిరాజితుడైనాడని కీ.శే. మల్లంపల్లి సోమశేఖర శర్మ వంటి చరిత్రకారులే మెచ్చుకున్నారు.

వీరి 'తెలుగుతల్లి' గీతాలు భాషాభిమానాన్ని చాటుతాయి. కరుణశ్రీగారి 'కవితాకుమారి' గురించి చెప్పాలంటే నవ్య కవులకు సంబంధించినదీ ఖండిక. ఆనాటికే ఇంగ్లీషు కవిత్వంలో 'రొమాంటిసిజమ్' కవులకు చలువపందిళ్లు నిర్మించింది. అటువంటి ఇంగ్లీషు కవిత్వ ప్రభావంతో భావకవిత్వం తెలుగునేలపై పాదం మోపింది. దాని ప్రభావమే ఈ గీతాల్లోనూ కనిపిస్తుంది. 'తెలుగు బాల' మకుటంతో ఆణిముత్యాలు అందించారు. సినారె చెప్పినట్లు 'ముద్దు బాలశిక్ష'తో శాస్త్రిగారు బాలవిజ్ఞానాన్ని, పలు సూక్తులు, స్తుతులు, కళలు, గతులు..రకరకాల సంగ్రహ విజ్ఞానాన్ని పద్య రూపకంగా బాలలకు అందించారు. తెలుగు కవితకు తెలుగునాట వెలుగు నింపిన కవి కరుణశ్రీ. మంచికవి, మధుర కవి. మాధుర్య మర్మాన్ని బాగా అర్థం చేసుకున్న మాటల మాంత్రికుడాయన. నవనీత కవితా హృదయం కలిగిన కవికోకిల 'కరుణశ్రీ'.

–డా.మంతెన సూర్యనారాయణరాజు

## కృతి

# గొప్ప కవిత్వానికి చిరునామా



'సాహితీమిత్రులు, విజయవాడ'వారు విశ్వేశ్వర రావు సంపాదకత్వంలో 2016 సంవత్సరంలో వివిధ పత్రికల్లో అచ్చయిన 86మంది కవుల కవితలతో 'కవిత-2016' పేరిట ఓ కవితా సంకలనాన్ని వెలువరించారు. లబ్ధప్రతిష్ఠులతోపాటు అప్పుడప్పుడు వ్యక్తమయ్యే కొత్త వారికి కూడా చోటు కల్పించడం విశేషం. ఇందులో ఎక్కువగా సామాజికస్పృహ వాదాన్ని వెనకేసుకొచ్చిన కవిత్వమే సాక్షాత్కరిస్తుంది. మేలిమి కవిత్వం స్వల్పంగానే దక్కిందని సంపాదకులు వాపోవడం గమనార్హం. 'బడులు తెరిచారు/ పసి తరగతి ప్రారంభమయ్యింది/ పిల్లలు బోరుబోరున విలపించారు/ ఆ రోజుకి/ అదే తొలి ప్రార్థన' యిదీ కొండూరి రామరాజు వారి చిట్టి కవిత. నిడివి కాదు, వ్యక్తీకరణలోని ప్రతిభను గమనించండి. 'ఇవాళ నేను ముద్దాడిన చెమట చుక్కలే/ రేపు పిడికెడు అన్నం మెతుకులవుతాయి'. ఇవి బాల సుధాకర మౌళి గొప్ప కవిత్వ పంక్తులు. 'అసలు సిసలు అంతర్దర్పణ మొకటి/ అందరిలోనూ దాగివుంటుంది/ అందులో చూస్తేనే/ అసలు రూపమేదో స్పష్టమవుతుంది' అంటున్న పక్కి రవీంద్రనాథ్ కవిత్వంలో తత్వం తొంగి చూసినా తార్కికంగా ఆలోచిస్తే జీవితసత్యం బోధపడ్తుంది. నందిని సిధారెడ్డి, అరుణ్‌సాగర్, దర్భశయనం, కె.శివారెడ్డి, ఆశారాజు, ఎన్.గోపి, దేవిప్రియ, పాపినేని, సినారె, ఇంద్రగంటి..ఇలా ఒకరేమిటి, పేరుప్రఖ్యాతులున్న నిత్యకవుల గొప్ప కవితల్ని పొందుపరిచిన సంకలనం ఇది.

**(కవిత 2016; వెల:రూ.150; ప్రతులకు: సాహితీమిత్రులు, 28-10- 16 మసీద్ స్ట్రీట్, అరండల్ పేట, కార్ల్‌మార్క్స్ రోడ్, విజయవాడ-520002, ఆం.ప్ర.)**

-రమణ వెలమకన్ని

# షడ్రసోపేత కథలు



సమకాలీన సమాజంలో తాను కన్న, విన్న, అనుభూతించిన సంఘటనల్ని ఎమ్మెస్వీ గంగరాజు కథలుగా మలచి మనకందిస్తున్న సంకలనమిది. బట్టలమడతల్లో దాచిన మొగలిరేకులు ఎండినా కూడా పరిమళం వెదజల్లినట్లు కొన్నాళ్ల తర్వాత మళ్లీచదివినా కథల పరిమళం పాఠకుల్ని చుట్టుముడుతుంది. సామాజిక, వ్యక్తిగత సమస్యలకు కొద్దిగా హాస్యం మేళవించి అందించారు రచయిత. 'కార్యసాధకులు' కథలోని కామయ్యపంతులు వ్రతానంతరభోజనం కానిచ్చి, ఆ ఇంటి ఇల్లాలిని పొగిడి, అదనంగా ఆవకాయ సీసాలో వేయించుకొని, మరోచోట ఆ ఇల్లాలిని పొగిడి, ఈవిడను తెగడుతాడు. అక్కడా మరో ఆవకాయసీసా!. 'శ్రీమంతుడు' కథలో పకోడీల ఘుమఘుమలు, దిబ్బరొట్టె, అటుకులట్లు, కొయ్యరొట్టె గురించి రాసి పాఠకుల నోరూరించారు. 'తృప్తి' కథలో మండూక వర్ధనరావు, కుంచితపాదం, కుచలకుమారిలాంటి గమ్మతయిన పేర్లతో హాస్యంపండించారు. 'పండగ' కథలో చిల్లుల్లేనిచొక్కా అల్లుడు వచ్చిన్నాడు వేసుకుందామనుకుంటాడు జగన్నాథం. ఆయన లేమిని అర్థంచేసుకుని ఆదుకుంటానని అభయమిస్తాడు అల్లుడు. కరుణ చిప్పిల్లే ఈకథ చదివిన పఠిత మనసు రసాప్లావితమవుతుంది. చదివించే మంచికథలివి.

**(ఎమ్మెస్వీ కథలు:ఎమ్మెస్వీ గంగరాజు; వెల: రూ.100; ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు)**

-కూర చిదంబరం

# సులభరీతిలో వాస్తు వివరం..



నివాస గృహ నిర్మాణమైనా కార్యాలయ భవన నిర్మాణమైనా..ఇంకాచెప్పాలంటే ఏరకమైన కట్టడమైనా ముందుగా ఆలోచించేది వాస్తు గురించే. ఆర్కిటెక్ట్‌లు సైతం వాస్తును దృష్టిలో ఉంచుకునే డిజైన్లు రూపొందించడం తెలియంది కాదు. అంతగా ప్రాధాన్యత సంతరించుకున్నది వాస్తు. ఈ నేపథ్యంలో డా.భీమా సాంబశివరావు గతంలో జ్యోతిర్వాస్తు విజ్ఞానం పత్రికలో శాస్త్రీయ విశ్లేషణలతో రాసిన వాస్తు శాస్త్ర సంబంధిత వ్యాసాలను తాజాగా 'వాస్తు సూత్రాలు- ఆధునిక గృహ నిర్మాణం' పేరిట పుస్తకంగా వెలువరించారు. ఇందులో పంథొమ్మిది అధ్యాయాలున్నాయి. వాస్తుశాస్త్రం- ప్రాధాన్యత- వికాసం తొలి అధ్యాయంగాను, ఆ తర్వాత వివిధ అంశాలను చర్చించి, చివరగా 19వ అధ్యాయంలో గృహాలంకరణను అనుబంధంగా చేర్చటం విశేషం. నేటి కాలానికి అవసరమైన వాస్తు సంగతులను ప్రజలకు అర్థమయ్యే రీతిలో, అందుబాటులో ఉంచాలన్న ఉద్దేశంతో ఈ పుస్తకాన్ని రూపొందించామన్నారు రచయిత. ఇందులో విషయాలను బొమ్మలతో సహా వివరించటం వల్ల పాఠకుడికి తేలిగ్గా, క్షుణ్ణంగా అర్థంచేసుకునే వీలేర్పడింది. ఈపుస్తకం వాస్తుగురించి తెలుసుకోవాలనుకునే పాఠకులకే గాక, వాస్తుశాస్త్ర పరిశోధకులకు, విద్యార్థులకు కూడా ఎంతో ప్రయోజనకరంగా ఉంది.

**(వాస్తు సూత్రాలు- ఆధునిక గృహనిర్మాణం: భీమా సాంబశివరావు; వెల:రూ.300; ప్రతులకు:తెలుగు బుక్‌హౌస్, కాచిగూడ క్రాస్‌రోడ్, ఆర్యసమాజ్ ఎదురుసందు, హైదరాబాద్-27)**

-ప్రభాస

# కవితలనిండా దళిత సంవేదన



దళిత బతుకులు, వేదనలు, వాదనలు డా. అంబేద్కర్ ఆలోచనా విధానాలు, బౌద్ధధర్మం..ఇలా ఎన్నో ప్రభావాలు మూడ్నాకూడుచిన్నస్వామి కవితల్లో కనబడతాయి. కృష్ణగిరి జిల్లా రచయితల సంఘం, హోసూరునుంచి వెలువడిన పుస్తకమిది. చిన్నస్వామి కన్నడంలోని సజీవమైన వ్యావహారిక భాషాపదాల్ని ఆశ్రయించి కవిత్వాన్ని చెప్పగలిగిన కవుల్లో ఒకరు. తిరుగుబాటును ఆహ్వానిస్తూ దళిత వాస్తవికత ప్రధాన సూత్రంగా 'ఇలా ఒక జీవితం' కవితా సంపుటి సాగింది. దీర్ఘకాలిక దళిత విమోచన పోరాటం నేర్పిన గుణపాఠాలు తీర్చిదిద్దాయి,కన్నడ సాహిత్యంలో దళిత ధ్వని గట్టిగా వినవచ్చింది. ఈ కవి రచనల్లో దళిత సంవేదనతో పాటు అభివ్యక్తిలో సంయమనాన్ని పాటించడం ప్రతి కవితలో కనిపిస్తుంది.

'చెప్పు మరియు నేను' కవితలో కవిఇలా అంటాడు..
'నేనొక చెట్టు/ అది నా మొదలని/ వారికి తెలియదు
ఎండిన చెరువు నీటి గుంతలో/ ముక్కునానించే కొంగలా
నేను కాలివేళ్ల మీద నిలబడి/ తొంగి కనిపించినంత దేవుని/ రూపాన్ని దొంగిలిస్తాను..ఆలయప్రవేశాన్ని అడ్డుకొనే పెద్దల పన్నాగం పై కవితలో ధ్వనిస్తోంది కదా. అలాగే తండ్రి-కొడుకుల సంభాషణ..'తలరాత' కవిత నాటిక ఫక్కీగా సాగుతుంది. ఆవుల్ని మేపే భార్యా భర్తల్ని వారి కొడుకు సంధించే ప్రశ్నలవర్షమే కవిత అంతా. ఇలాఎన్నెన్నో...

**(ఇలా ఒక జీవితం -కవితల జంపు-కన్నడమూలం: మూడ్నాకూడు చిన్నస్వామి; అనువాదం:స.రఘునాథ;వెల: రూ.80 ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు)**

-తంగిరాల చక్రవర్తి




# అనుమానం ప్రేమాంతకం

కస్తూరి మురళీకృష్ణ

అతడు చెప్పింది విన్న ఆ నలుగురు ఆశ్చర్యపోయారు.

'నిజమా?' అనడిగారందరూ ఒకేసారి.

తల ఊపాడతడు. 'ఆమె ఎంత అందమైనదో అంతగా మాయల మరాఠి. లేని ఉన్నట్టు భ్రమింపచేస్తుంది. ఉన్నది లేనట్టు నమ్మిస్తుంది. ఆమె అందం ప్రలోభంలో పడి సర్వం పోగొట్టుకున్నవారెందరో. ప్రలోభంలో పడ్డవారిని దోచుకుని తరిమేస్తుంది. జాగ్రత్త ఆ వైపుకు వెళ్లకండి' చెప్పి వెళ్లిపోయాడతడు.

వాళ్లు నలుగురూ ఒకరివైపొకరు చూసుకున్నారు.

ఉమెర్‌కోత్ రాజు హమీర్ సూమరూ, తన మంత్రులు రాణో మహేంద్ర, సన్వరో ధర్మాచన్నీ, దౌన్రో భత్యానిలతో కలిసి వేటకు వచ్చాడు. అది వారికి అలవాటు. వారు తమరాజ్యంలోనే కాదు, అప్పుడప్పుడు పొలిమేరలుదాటి పొరుగురాజ్యాల అడవుల్లోనూ వేటాడతారు. మారువేషాలలో ఉండటంతో వారిని ఎవ్వరూ గుర్తించలేరు. వేట పూర్తయిన తరువాత వారు మళ్లీ తమ రాజ్యానికి వెళ్లిపోతారు.

ఈసారి అలాగే సాహసాలు చేస్తూ ఉమర్‌ఖేత్‌కు ఈశాన్యాన ఉన్న 'లోదువ' ప్రాంతానికి చేరుకున్నారు. అక్కడే అసాధారణ సౌందర్యవతి, అత్యంత చతురత కల మోమత గురించి ఏడుగురు అక్కచెల్లెళ్ల గురించి విన్నారు.

వారిలో అత్యంత సౌందర్యవతి మోమత అని, సోమత్, నవిర్‌లు తెలివైన వారని విన్నారు. వారు 'కాక మహల్'లో నివసిస్తారని తెలుసుకున్నారు. ఆ మహల్ ఓ 'మయసభ'లాంటిదనీ, మోమత సౌందర్యం విని ఆమెని పొందాలని వెళ్లినవారు ఆ మయసభలో చిక్కి ఉక్కిరిబిక్కిరవుతూంటే చూసి ఆనందించి అవమానించి పంపేస్తుందనీ తెలుసుకున్నారు.

'ఇలా పురుషులను పురుగుల్లా ఆకర్షించి దీపంలో మాడ్చేసే ఆమె అంతుచూడాలి' అన్నాడు రాజు హమీద్ సుమరూ.

కానీ మంత్రులు రాజును వారించారు. 'తమరికి అక్కడ ఎలాంటి అవమానం జరిగినా అది రాజ్యానికి అవమానం అవుతుంది. తమరు ఇలాంటి వాటికి దూరంగా ఉంటే మంచిది' అన్నారు.

రాజు మహేంద్రవైపు చూశాడు. 'నువ్వు తెలివైనవాడివి, ధైర్యశాలివికదా...నువ్వు ఆ మోమత సంగతి తేల్చవచ్చుకదా!' అన్నాడు.

'ప్రభువు ఆజ్ఞ. నాకూ ఆ సౌందర్యవతి అహంకారం అణచాలని ఉంది. తమరు ఆజ్ఞ ఇస్తే' అన్నాడు మహేంద్ర.

మహారాజు ఆజ్ఞ ఇచ్చాడు. మహేంద్రను వదలి ఇతర మంత్రులతో తన రాజ్యం వెళ్లిపోయాడు. 'విజయం సాధించి రమ్మ'ని.

ఒంటరిగా మిగిలిన మహేంద్ర స్థానికులనుంచి మరింత సమాచారం సేకరించాడు. మోమతను పొందాలని ప్రయత్నించి భంగపడినవారిని కలసి వారి అనుభవాలు తెలుసుకున్నాడు.

మోమతను గెలచి, ఆమె అహంకారం అణచేందుకు ప్రణాళికను రచించాడు.

'కాక మహల్' చేరుకుని గంట మోగించాడు.

********

అన్ని మాయలను ఛేదించి, అడ్డంకులను అధిగమించి తన ముందు నిలుచున్న మహేంద్రను చూసింది మోమత రాణో.

అతడిని చూస్తూనే ఆమె అతడికి 'దాసి' అయిపోయింది.

తాను అన్న భావం ఆమెలో నశించింది. అంతవరకూ తన అందం పట్ల, తెలివిపట్ల ఉన్న విశ్వాసం, అహంకారం అన్నీ అతని దర్శన మాత్రంతో సూర్యుడి కిరణం సోకగానే కరగిపోయే మంచుబిందువులా ఆవిరైపోయాయి.

మహేంద్ర పరిస్థితి ఇందుకు భిన్నంగా ఏమీలేదు. అంతవరకూ ఒక అహంకారి అహం అణచివేయాలన్న అభిప్రాయంతో ఉన్న అతడు ఆమెని చూడటంతోటే ఆమెకు అహం లేకపోతే ప్రపంచంలో ఇంకెవరికీ అహం ఉండే అర్హత లేదన్న నిశ్చయానికి వచ్చేశాడు. అంతేకాదు, ఆమె అందం ముందు తన ధైర్యం, శౌర్యం, తెలివి సర్వం దిగదుడుపేనన్న గ్రహింపు కలిగింది. ఆమె తన్ను దయగా చూస్తే ఈ జన్మకు అంతకన్నా మరో కోరిక ఏమీలేదన్న భావన కలిగింది. ఆమె తనవైపు ప్రేమగా చూస్తే తన జన్మ ధన్యమైపోతుందన్న నమ్మకం కలిగింది.

ఇద్దరూ ఒకరి దర్శనంతో మరొకరు ఒకరికొకరు బానిసలైపోయారు.

ఒక స్త్రీ, ఒక పురుషుడు అహంకారం వదలి, అస్తిత్వం కోల్పోయి 'నా' అన్నది లేకుండా, ఒకరితోఒకరు ఎంతగా కలిసిపోయి మమేక మవగలరో అంతగా వారు మమేకమైపోయారు. అలా కొంతకాలం తర్వాత హఠాత్తుగా మహేంద్రకు తనకోసం తన రాజు ఎదురుచూస్తుంటాడని గుర్తుకువచ్చింది.

తన కర్తవ్యం, బాధ్యతలు గుర్తుకువచ్చాయి.

'నేను ఎల్లకాలం ఇక్కడే ఉండలేను' నిట్టూరుస్తూ విషాదంగా చెప్పాడు.

'అది నాకు తెలుసు. నీకు నీ బాధ్యత గుర్తుకు వచ్చే ఘడియను తలచుకుని భయపడుతూనే ఉన్నాను' అంది మోమత.

'నేను నిన్ను వదలి ఉండలేను' ఆమెను చుట్టేస్తూ అన్నాడు మహేంద్ర.

'నేను ఉండగలనా?' అతడిలో కరగిపోతూ అంది మోమత.

'ఏంచేద్దాం?' అడిగాడు మహేంద్ర.

'రోజంతా కాకపోయినా కనీసం రోజుకు ఒకసారి అయినా నిన్ను కలవందే నేను బతకలేను' అంది మోమత.

'నేను బతకగలనా?' అడిగాడు మహేంద్ర.

వారిద్దరి సమస్యను విన్న మోమత సోదరీమణులు నవ్వారు.

'రోజూ కలుసుకుంటేనే ప్రేమ నిలుస్తుంది, మాట్లాడుకుంటేనే ప్రేమ నిలుస్తుంది. అనుకుంటే అది అసలు ప్రేమ కాదు. కలసినా, కలవకున్నా, ఎంతకాలమయినా ఒకరి మనస్సుల్లో మరొకరు స్థిరంగా ఉండటమే అసలు 'ప్రేమ' అన్నారు.

నవ్వారు మోమత, మహేంద్రలు. 'మేము కలవకుంటే మాట్లాడకుంటే మా ప్రేమ గెలుస్తుందో లేదో తెలియదు కానీ మేము బతికి ఉండం' అన్నారిద్దరూ ఒకేసారి.

సోమత సలహా ఇచ్చింది. 'మా దగ్గర ఓ ఒంటె ఉంది. అది అత్యంత వేగవంతమయిన ఒంటె. దాన్ని తీసుకుంటే మీరు అర్ధరాత్రి

బయలుదేరితే తెల్లారేలోగా మీ రాజ్యం చేరవచ్చు. సాయంత్రం బయలుదేరితే చీకటిపడే వేళకు ఇక్కడికి రావచ్చు' అంది.

మహేంద్ర కళ్లు మెరిశాయి. 'బాగుంది. నేను నా విధులు నిర్వహించి సాయంత్రం అవుతుండగా బయలుదేరితే రాత్రి అయ్యేలోగా వస్తాను. మనం కాస్సేపు కలసి గడపవచ్చు. మళ్లీ తెల్లారేలోగా బయలుదేరితే, విధులు నిర్వహించాల్సిన సమయానికి మా దేశం చేరవచ్చు. ఈరకంగా కనీసం కొన్ని గంటలయినా రోజూ నీతో గడపవచ్చు' అన్నాడు సంతోషంగా.

కానీ మోమత ముఖంలో సంతోషం కనబడలేదు. 'నీకు ప్రయాణ కాలం అధికం. మనం కలసి గడిపే సమయం స్వల్పం. పైగా శ్రమ. ఉదయం కర్తవ్య నిర్వహణ, రాత్రంతా ప్రయాణం. నీకు విశ్రాంతి ఏది?' అడిగింది. ఇద్దరూ కలసి గడిపే సమయం స్వల్పం అన్నప్పుడు ఆమె కళ్లల్లో నీళ్లు నిలిచాయి.

'భగవంతుడు ఎందుకనో మనిద్దరినీ కలిపేడు. కానీ మనం నియమనిబంధనల నడుమ కలిసేట్టు చేశాడు. ఇది మన ప్రేమకు పరీక్ష. అసలు కలవలేకపోవటంకన్నా కొంతకాలమైనా కలుస్తాం కదా! ఎంత స్వల్పకాలం అయితే, అంత అమూల్యం మనం గడిపేకాలం. ఈ అవకాశమైనా భగవంతుడు కల్పించాడని సంతోషిద్దాం. ఆనందిద్దాం. లేనిదాన్ని చూసి ఏడుస్తూంటే ఉన్నదీ చేయిజారిపోతుంది' అన్నాడు ఆమెను అనునయిస్తూ.

'కానీ రోజూ రావాలి. మనం కలసి గడిపిన అమూల్యమైన కాలాన్ని తలచుకుంటూ రోజంతా గడిపేస్తాను. కానీ నిన్ను రోజూ కలవకుండా నేను ఉండలేను' అందామె.

'నేను ఉండగలనా? నేను జీవించేది రోజూ మనం కలసి గడిపే ఆ కొద్ది ఘడియల కోసమే' అన్నాడతడు ఆమెని దగ్గర తీసుకుంటూ.

'మంత్రి మహేంద్ర ప్రవర్తనలో మార్పు వచ్చిందికదా! ఇంతకు ముందులా మనతో సమయం గడపటంలేదు. చర్చల్లో పాల్గొనటం లేదు. సాయంత్రం అవుతూనే పరుగులిడుతూ పారిపోతున్నాడు. రాత్రిళ్లు ఇంటిదగ్గర ఉండటంలేదు' అన్నాడు రాజు తన మంత్రులతో.

మంత్రి విషాదంగా తల ఊపాడు. 'మీకు గుర్తుందా! మనం క్రితం సారి వేటకు వెళ్లినపుడు ఓ ఇంద్రజాలికురాలైన మంత్రగత్తె గురించి విన్నాం. ఆమెను గెలిచి తననితాను ఓడిపోయాడు మన మహేంద్ర.

'నిజమా?' రాజు గుండె అసూయతో భగ్గుమంది. మోమత అందం గురించి విన్నప్పుడల్లా ఆమె తనది కావాలన్న కోరిక అతడిలో బల పడుతూ వచ్చింది. కానీ మయసభలాంటి కాకమహల్‌లో అవమానాల పాలవటం ఎందుకని ఆ ప్రయత్నం చేయలేదు. తన మంత్రి ఆమెని పొందటమే కాదు, ప్రతిరాత్రి ఆమె దగ్గరకు వెళ్లి ఆనందాలనుభవిస్తున్నాడనే సరికి రాజు భరించలేకపోయాడు.

మరుసటి రోజు ఉదయం మహేంద్ర సభకు రాగానే నిష్కర్షగా చెప్పాడు 'నువ్వు మోమతని కలవటం ఆపేయాలి. ఇది నా ఆజ్ఞ'

మహేంద్ర ఏమీ మాట్లాడలేదు. తలవంచి అభివాదం చేశాడు.

*********

రాజాజ్ఞను పాటించలేకపోయాడు మహేంద్ర. మోమతని కలవకూడదన్న ఆలోచన అతడిని నిలవనీయలేదు. 'కలవలేను' అనుకుంటే ఊపిరి అందటంలేదు. శరీరమంతా విషం నిండినట్టు అనిపిస్తోంది.

మోమతని చూడకూడదు. చూడలేను అనుకుంటే శరీరమంతా ఒక విచిత్రమైన భరించలేని భావన విస్తరించింది. తన బతుకు వ్యర్థం అనిపించింది. నిలవలేకపోయాడు. మహారాజుకు కోపం వస్తే ఏమవుతుంది? ప్రాణం పోతుంది. అంతేకదా! మోమతని కలవకున్నా తన ప్రాణంపోతుంది. ఆమెని కలవకుండా ప్రాణం కోల్పోయేకన్నా ఆమెని కలసి ప్రాణాలు కోల్పోవటమే మేలు.

నిశ్చయించుకున్నాడు. ఒంటెపై బయలుదేరాడు.

*********

త్వరత్వరగా పని ముగించుకుని ఒంటెను చేరుకున్న మహేంద్ర మ్రాన్పడి నిలుచుండిపోయాడు. ఎవరో ఒంటె కాళ్లు కత్తిరించారు.

ఎవరోకాదు..మహారాజే..మహారాజు ఆజ్ఞపై సైనికులు ఒంటె కాళ్లు కత్తిరించి ఉంటారు.కానీ మోమతని కలవకుండా తాను నిలవగలడా?

మరో ఒంటెను తెప్పించాడు. అది అంత వేగంగా నడవదని తెలుసు. అయినా దానిపై బయలుదేరాడు.

*********

అలవాటులేని ఒంటెపై ప్రయాణం కష్టంగా ఉంది. కాస్సేపటికి తాను దారి తప్పానని గ్రహించాడు మహేంద్ర. తనకోసం మోమత ఎదురుచూస్తూంటుందన్న ఆలోచన అతడిని నిలవనీయటంలేదు.

తాను ఎక్కడున్నాడో తెలుసుకున్నాడు. సరైన దారి ఏదో తెలుసుకుని ఒంటెను ఆ దారిలో నడిపించాడు.

*********

'ఇంకా రాలేదు' అది వెయ్యోసారి మోమత దారివైపు చూస్తూ తనలో తాను అనుకోవటం.

'ఏదైనా పని తగిలి ఉంటుంది. రేపు వస్తాడేమో!' సోదరి సోమత మోమతను ఓదార్చాలని ప్రయత్నిస్తోంది.

'ఎంత పని తగిలినా ఆయన రాకుండా ఉండరు. ఆయనని చూడకుండా నేను ఉండలేను'.

'ఉండు..నేను మాయచేసి తెప్పిస్తాను' నీ బాధ చూస్తూ ఉండలేను' అంది సోమత.

'నీకు మాయలు తెలుసు కానీ ఎక్కడో ఉన్న మనిషిని తెచ్చి నా ముందు నిలిపేంత మాయలు తెలియవు' అంది మోమత.

'చూస్తావుగా' అంటూ వెళ్లింది సోమత.

ఆమె 'ఏం చేస్తుందా!' అని కుతూహలంగా ఆవైపు చూస్తున్న మోమత ఊపిరి ఒక్కసారిగా స్తంభించిపోయింది.

ఎదురుగా మహేంద్ర! పరుగునవెళ్లి మహేంద్రను కౌగలించుకుంది.

విద్యుద్ఘాతం తగిలినట్టు అతడిని వదిలేసింది.

అది మహేంద్ర కాదు. మహేంద్రలా వేషం చేసుకున్న సోమత!

'ఇదా నీ మహేంద్రజాలం!' నవ్వింది మోమత.

'మహేంద్రను చూపించానా, లేదా?' అడిగింది సోమత.

ఇద్దరూ నవ్వటం ఆరంభించారు.

*********

'మోమత నేను వచ్చేశాను. నిన్ను వదలి ఉండలేను. ఇక నేను నా రాజ్యానికిపోను. ఇక్కడే ఉండిపోతాను. నీకు దూరంగా ఉండలేను' అనుకుంటూ గదిలో అడుగుపెట్టిన మహేంద్ర ఎదురుగా కనిపిస్తున్న దృశ్యం చూసి స్థాణువైపోయాడు.

'ఎదురుగా మంచంపై మోమత పక్కన పురుషుడెవడో ఉన్నాడు.

అతడికి ఏడుపు వచ్చింది. అసహ్యం అనిపించింది. కోపం వచ్చింది. కొన్ని గంటలు ఆలస్యం అయింది. అంతలోనే ఉండలేక పర పురుషుడిని పిలిపించుకుందా? ఇక ఆలోచించలేదు. మహేంద్ర వెనుతిరిగి పరుగున వెళ్లిపోయాడు.

అలికిడి విని కళ్లు తెరిచిన మోమత, మహేంద్ర వెళ్లిపోవటం చూసింది. వెనకే వెళ్లి పిలిచింది. మహేంద్ర వినిపించుకోలేదు.

*********

'మీరు చూసింది నిజంకాదు. మోమత పక్క ఉన్నది పరపురుషుడు కాదు. పురుషవేషంలో ఉన్న సోమత'. మోమత సోదరి నాతిక చెప్పింది. ఆమెవైపు తిరస్కారంగా చూశాడు మహేంద్ర.

'మీరు నన్ను మోసం చెయ్యలేదు. నా కళ్లు చూసిన నిజాన్ని నమ్మకుండా ఉండలేను'.

'నమ్మకం ప్రేమకు ప్రాణం వంటిది. నమ్మకం లేని ప్రేమ ప్రాణంలేని శరీరం వంటిది'

'నమ్మకం పోగొట్టింది ఎవరు? ఇప్పటికీ మోమతను మరో పురుషుడితో ఊహిస్తేనే శరీరం సర్వం దహించుకుపోతున్నట్టుంది.

'మీరు చూసింది నిజంకాదు. మీరు తప్పించి ఆమె మరొకరివైపు కన్నెత్తిచూడదు'.

'అది నేను ఉన్నప్పుడు, లేనప్పుడు నేను పరపురుషుడిని'.

(మిగతా 19వ పేజీలో)

# రంగులు వేయండి



పిల్లలూ! పైబొమ్మకు కింద సూచించినట్లు రంగులు వేయండి.
1.RED 2.YELLOW 3.LIGHT GREEN
4.DARK GREEN 5.BLUE 6.PURPLE

# దారి చూపుతారా



# అన్నదమ్ముల స్నేహం

కథ

వరుణ్, తరుణ్ అన్నదమ్ములు. ఇద్దరూ కవలలు. బాల్యంనుండి వాళ్లెంతో స్నేహంగా ఉండేవారు. ఒకరికోసం ఒకరు అన్నట్లు ఎంతో ఆదర్శ స్నేహభావాలతో మెలిగేవారు. వరుణ్ బాల్యం నుంచి అవినీతి, అన్యాయానికి వ్యతిరేకంగా పోరాడేవాడు. తరుణ్‌కుసైతం అటువంటి భావాలు ఉన్నప్పటికి ఇటువంటి పోరాటాలు చేయడంవల్ల సమాజంలో అందరితో శత్రుత్వం వస్తుందనే భావనతో బహిరంగ విమర్శలు చేసేవాడుకాదు. ఇద్దరూ పెరిగి పెద్ద వారయ్యారు. ఇద్దరూ మంచి విద్యావంతు లుగా ఖ్యాతినార్జించారు. వరుణ్ తనపంథాను మార్చు కోలేదు. మహారాజుచేస్తున్న పొరపాట్లను బహి రంగ సభలో తీవ్రస్థాయిలో విమర్శించడం మొదలు పెట్టాడు. వరుణ్‌కు పెళ్లయి ఒకపాప కూడా పుట్టింది. తరుణ్‌కు ఇంకా పెళ్లికాలేదు. ఒకరోజు అన్నదమ్ములిద్దరూ మాట్లాడుకుంటుం డగా 'అన్నయ్యా! నీ పంథా మార్చుకో. ప్రతి విషయంలో మహ రాజును విమర్శిస్తే నీ ప్రాణానికే ముప్పువస్తుంది. నీ మీద ఆధార పడి కుటుంబం ఉందన్న సంగతి మరచిపోకు' అని హెచ్చరించాడు.

'అవినీతి, అక్రమాలకు ఎదురునిలవడం తప్పెలా అవుతుంది తమ్ముడూ! ఎవరో ఒకరు ఎదురు తిరగకపోతే ప్రజల్లో చైతన్యం ఎలావస్తుంది?' అని ఎదురు ప్రశ్నవేశాడు వరుణ్.

కాలం గడుస్తోంది. వరుణ్ బహిరంగ సభలు పెట్టి రాజ్యంలో జరుగుతున్న తప్పులను ఎత్తిచూపుతున్నాడు. ఈ విషయం గూఢచారుల ద్వారా మహారాజు తెలుసుకున్నాడు. వరుణ్‌ను బంధించి తీసుకురావలసిందిగా ఆదేశాలు జారీచేశాడు. సైనికులు వరుణ్‌ను బంధించి మహా రాజు ఎదుట నిలబెట్టారు. వాదోపవాదాలు జరిగాయి. మహా రాజుకు ఎదురుతిరిగిన నేరంపై వరుణ్‌కు మరణశిక్ష విధించారు. ఉదయాన్నే ఉరితీయ వలసిందిగా మహారాజు ఆదేశించి 'నీ చివరి కోరిక ఏమిటి?' అని ప్రశ్నించాడు.



'ఇంటికివెళ్లి నా భార్యాబిడ్డలను ఒకసారి చూసిరావాలనేది నా చివరికోరిక. మళ్లీ ఈరోజు సాయంత్రానికే తిరిగివస్తాను' అన్నాడు వరుణ్.

'నువ్వు ఇంటికి వెళ్లి తిరిగి వస్తావని నేనెలా నమ్మేది?' ప్రశ్నించారు మహారాజు.

వరుణ్ సమాధానం చెప్పలేకపోయాడు.

'మహారాజా! మా అన్నయ్య ఇంటికి వెళ్లి వచ్చేవరకు నేను మీ అధీనంలో ఉంటాను. ఒకవేళ మా అన్నయ్య తిరిగిరాకపోతే అతనికి బదులు నన్ను ఉరితీయండి' అన్నాడు అదే సభలో ఉన్న తరుణ్.

మహారాజు తరుణ్ గురించి తెలుసుకుని అందుకు అంగీకరించి తరుణ్‌ను చెరసాలలో బంధించమని, వరుణ్‌ను విడిచిపెట్టాడు.



# తెలుసుకుందాం... వార్త ఆదివారం

వరుణ్ ఇంటికివెళ్లాడు. కానీ సాయంత్రం తిరిగి రాలేదు. చెరసాల వద్ద కాపలా సైనికులు 'నీ అన్న నిన్ను మోసంచేశాడు. మళ్లీ తిరిగి రాడు. రేపు ఉదయాన్నే నీకు ఉరి ఖాయం' అని హేళనచేశారు.

అయినా తరుణ్ బెదరలేదు. కళ్లు మూసుకొని ధ్యానంచేశాడు.

'ఏంచేస్తున్నావు?' ప్రశ్నించారు సైనికులు.

'నా అన్నకు కుటుంబం ఉంది. అతని ప్రాణానికి హానికలిగితే వాళ్ల జీవనాధారంపోతుంది.నేను ఏకాకిని. కాబట్టి నా అన్న తిరిగి రాకూడదు. ఆ ఉరిశిక్ష నాకే అమలు జరగాలని దేవుణ్ని ప్రార్థిస్తున్నాను' చెప్పాడు.

అప్పుడే అక్కడికి వచ్చిన మహారాజు ఆ మాటలు విని చలించిపోయాడు. అన్నదమ్ముల అనుబంధంలోని గొప్పతనాన్ని తెలుసుకున్నాడు.

ఇంతలో వరుణ్ వచ్చేశాడు. 'ఎందుకాలస్యమైంది' అడిగాడురాజు.

'నా గుర్రానికిఎదురు దెబ్బతగిలి పడిపోయింది. దాంతోపాటు నాక్కూడా దెబ్బలు తగిలాయి. అది నన్ను మోయలేని స్థితిలో ఉంది. నా తమ్ముడి ప్రాణాలు రక్షించుకునేందుకు పరుగులు తీస్తూ వచ్చాను' అన్నాడు వరుణ్. అన్నదమ్ముల స్నేహానుబంధం మహారాజును ఆలోచింపజేసింది. 'మీ అనుబంధం, నిజాయితీ నాకు అంతులేని ఆనందాన్ని కలిగించాయి. ఉరిశిక్షను రద్దుచేస్తున్నాను. మీ ఇద్దరినీ నా ఆంతరంగిక సలహాదారులుగా నియమిస్తున్నాను. ఇకపై రాజ్యంలో జరిగే తప్పులను చెప్పడమేగాక వాటి పరిష్కారాలు చెబితే అమలుచేస్తాను' అన్నారు మహారాజు.

ఆరోజునుంచి అన్నదమ్ములు రాజ్యాభివృద్ధికి కృషిచేశారు.

–షేక్ అబ్దుల్ హకీం జాని

## హలో ఫ్రెండ్...



చిన్నారుల ప్రశ్నలకు

వార్త సిఎండి, మేనేజింగ్ ఎడిటర్

## గిరీష్ అంకుల్ సమాధానాలు

**ఎన్.కార్తికేయ, తిరుపతి.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను తొమ్మిదో తరగతి చదువుతున్నాను. మానవ అభివృద్ధి సూచికను ఎలా రూపొందిస్తారు? దయచేసి వివరించండి.**

**జవాబు:** కార్తికేయా! ఒక దేశం సంపన్నదేశం అంటే ఆదేశంలోని ప్రజలందరూ భాగ్యవంతులని అర్థంకాదు. అక్కడ కూడా నిరుపేదలు ఉంటారు. అలాగే ఒక దేశం ఆర్థికంగా వెనుకబడింది అంటే ఆదేశంలోని ప్రజలంతా నిరుపేదలని అర్థంకాదు. అక్కడ కూడా సంపన్నులుంటారు. జాతీయోత్పత్తి, జనాభా..ఈ రెండు అంశాలతో సగటు ఆదాయాన్ని లెక్కగట్టి ఆయా దేశాలు ఏ స్థాయిలో ఉన్నదీ నిర్ణయిస్తారు. అయితే ఆర్థిక అంశాలతో ముడిపెట్టి దేశాల స్థాయిని నిర్ణయించడం సమంజసం కాదని ఐక్యరాజ్య సమితి అభివృద్ధి కార్యక్రమం వారు 1990లో మానవ అభివృద్ధి సూచికను రూపొందించారు. జాతీయోత్పత్తి, తలసరి ఆదాయంతో పాటు ఆయుః ప్రమాణం, విద్యా ప్రమాణాలస్థాయి, జీవన ప్రమాణాల స్థాయి..ఈ మూడు అంశాల ఆధారంగా ప్రతి సంవత్సరం మానవ అభివృద్ధికి సంబంధించిన సూచికలను తయారుచేస్తారు. మానవ అభివృద్ధి సూచిక ప్రజల జీవన ప్రమాణాలకు కొలమానం లాంటిది. ఒక దేశంలో ప్రజల సగటు జీవనకాలం, శిశు మరణాలు, పౌష్టికాహార లోపం, అక్షరాస్యతాశాతం, పాఠశాలల్లో, కళాశాలల్లో నమోదయ్యే విద్యార్థులసంఖ్య, స్త్రీ,పురుషుల మధ్య అవకాశాల తారతమ్యం, ప్రజాస్వామ్యం, పర్యావరణ ప్రమాణాలు మొదలైన వాటి ఆధారంగా ప్రతి సంవత్సరం మానవాభివృద్ధి సూచికను రూపొందిస్తారు. అమర్త్యసేన్ జీవన ప్రమాణాలపై ఒక సంక్షేమ సూచికను రూపొందించారు. దారిద్ర్యరేఖకు పైన ఉన్నవారు, దిగువ ఉన్నవారు అనే అంశాలను పక్కన పెట్టి దారిద్ర్య రేఖకు మరీ దిగువస్థాయిలో ఉన్న వారిని మాత్రమే అమర్త్యసేన్ విశ్లేషించారు. దీన్ని ఆర్థికవేత్తలు 'సేన్ ఇండెక్స్'గా గుర్తించారు. మానవాభివృద్ధి సూచికలో అమర్త్యసేన్ సూచించిన మానవ పురోగతి సూచికనే ఐక్యరాజ్య సమితి అభివృద్ధి కార్యక్రమం (యుఎన్‌డిపి) ప్రమాణంగా తీసుకుంది.

**డి.కమలిని, హైదరాబాద్.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఆరో తరగతి చదువుతున్నాను. గుడ్లు పొదగని పక్షులు ఉన్నాయా? దయచేసి చెప్పండి.**

**జవాబు:** కమలినీ! కోయిల గూడుకట్టకుండా కాకి గూట్లో గుడ్లు పెట్టివెళుతుంది. కాకే ఆ గుడ్లను పొదుగుతుంది. అలాగే హనీ గైడ్ కూడా ఇతర పక్షుల గూళ్లలో గుడ్లను పెడుతుంది. కొన్ని పక్షులు గూళ్లుకట్టి, గుడ్లుపెట్టినా వాటిని పొదగక ఎండకి వదిలేస్తాయి. ఉదా. ఆఫ్రికాలోని క్రొకడైల్ బర్డ్.



# శ్రీవరలక్ష్మీ నమస్తుభ్యం..

–ద్యాప వనిత విజయకుమార్

మేలిమి గుణాలు, శోభ, కళ, సంపద, ఉత్సాహం, ఆనందం, శాంతం, సామరస్యం, సౌమనస్యం...ఈ శుభగుణాలకు సాకారమే శ్రీలక్ష్మి. ఈ శుభగుణాలే ప్రతివారూ ఆశించేవి. అందుకే లక్ష్మీ ఆరాధన.. శ్రీవరలక్ష్మీవ్రతం అన్ని వర్ణాల వారు అత్యంత భక్తిశ్రద్ధలతో ఆచరిస్తారు. ఈ వ్రతాన్ని ఆచరించినందువల్ల ఆ లక్ష్మీదేవి కరుణాకటాక్షాలతోపాటు అష్టైశ్వర్యాలు కలిగి కుటుంబం సమస్త సంపదలతో తలతూగుతుందని గాఢమైన విశ్వాసం. శ్రావణమాసం శుక్లపక్షంలో పూర్ణిమకి ముందు వచ్చే శుక్రవారం రోజున వరలక్ష్మీవ్రతం జరుపుకోవడం ఒక ఆచారంగా వస్తోంది. నిత్యసుమంగళిగా ఉండాలని కోరుతూ మహిళలు ఈ వ్రతం ఎంతో భక్తిశ్రద్ధలతో జరుపుకొంటారు.




సూర్యోదయానికి ముందే ఆవుపేడ నీళ్లతో కళ్లాపి చల్లి రకరకాల రంగవల్లులతో వీధిలోనుంచి ఇంటిలోకి ముగ్గులు వేస్తారు. ఇలా చేయడం లక్ష్మీప్రదం. గృహాన్ని కూడా పసుపునీళ్లతో తుడుచుకుంటారు. లక్ష్మీప్రదేశమైన తలుపుకి పైనున్న కమ్మీకి పసుపురాసి బొట్లు పెడతారు. ఉదయాన్నే తలస్నానం చేస్తారు. ముఖ్యంగా మానసిక స్నానం (ఆత్మశుద్ధి) అవసరం. స్నానమనేది శుచిశుభ్రతలకు సంకేతమేగాని పవిత్రకార్యం కాదు. ఆత్మశుద్ధితో మనసు ప్రశాంతంగా ఉండడంకోసమే. వ్రతంచేసే ముందు చేసే స్నానాన్ని క్రియాంగము అని అంటారు. తరువాత చూపుడువేలు ఉపయోగించకుండా బొట్టుపెట్టుకుంటారు. ఎవరినీ తాకకుండా దేవునికి ఇష్టమైన శుచి, శుభ్రత పాటిస్తూ పరిశుభ్రమైన వస్త్రాలను ధరించడం శ్రేష్ఠం. దేవిని ధ్యానిస్తూ, ఉపవాస దీక్ష చేస్తూ, నైవేద్యం తయారుచేస్తారు.







పూజచేసే స్థలాన్ని కడిగి, ఆ తర్వాత పసుపునీళ్లతో అలికి, బియ్యపు పిండితో నాలుగువైపుల ముగ్గు వేసి, మధ్యన అష్టదళ పద్మం వేస్తారు. 'ధనలక్ష్మి ఒకరి దగ్గర ఒకచోట స్థిరంగా ఉండదు. లక్ష్మి చంచల మనస్సు గలది. అయితే ఉన్న నాలుగు రోజులు ఉయ్యాలలూగిస్తుంది. అందరినీ, అన్నిటినీ దాసోహమనిపిస్తుంది. తన శక్తి ఏమిటో, ఎంతటిదో చూపిస్తుంది. అందుకే డబ్బుకు లోకం దాసోహం అంటారు. తన చంచలత్వాన్ని తెలియపర్చటానికే శ్రీమహాలక్ష్మి నీటి కొలనులో ఉన్న తామరలో కూర్చుని ఉంటుంది. నీటిలో ఉన్న తామర నిశ్చలంగా ఉండదు. చిన్నగాలికే అటుఇటు ఊగిసలాడుతుంది. తామర నీటిలో ఉన్నంతసేపే నిగనిగలాడుతుంది. నీటినుంచి బయటకు తీయగానే వాడిపోతుంది. డబ్బుకూడా పెట్టెలో భద్రంగా ఉంటేనే మనిషికి శక్తి ఉంటుంది. బయటకు తీసి ఖర్చు పెట్టేస్తే మనిషికి శక్తి సన్నగిల్లుతుంది. అందుకే పద్మాన్నే ముగ్గుగా వేస్తారు. షోడశోపచార పూజకు అంగంగా కలశారాధన చేస్తారు. అష్టలక్ష్మి అనుగ్రహం కోసం కలశం కింద బియ్యంపోస్తారు. 'కలశ ముఖంలో విష్ణువు, కంఠంలో రుద్రుడు, మూలంలో బ్రహ్మ. మధ్యలో మాతృగణాలు ఉంటాయని అంటారు. ఓ గంగా! యమునా! సరస్వతీ! కృష్ణవేణీ! గోదావరి! నర్మదా! సింధూ! కావేరీ! నదుల పేర్లు చదువుతూ ఆయాదేవతలను ఆహ్వానిస్తూ దాన్ని పూజిస్తారు. కలశం దేవతకు ప్రతిరూపం. అలాంటి కలశ జలం పరమ పావనమైంది. ఆ నీటిని పూజా ద్రవ్యాల మీద, దేవుడిమీద, పూజచేసేవారు చల్లుకోవాలి. అలాచేస్తే ప్రతిరోజు అన్ని పవిత్రనదుల్లో స్నానం చేసినంత పుణ్యం వస్తుందని, తద్వారా పూజ ఫలప్రదమవుతుందని నమ్మకం.

అమ్మవారి స్థాపనలు చాలా రకాలుగా ఉంటాయి. చాలామంది కొబ్బరి కాయతో ప్రతిమను తయారుచేస్తారు. దానికి పసుపు రాసి రెండు పక్కల రెండు పసుపుముద్దలను అతికించి వాటిని చెవి ఆకారంలో ఉండలాగా తయారుచేసి కాటుకతో కనురెప్పలు, కనుబొమ్మలు, కనులు తయారుచేసి, కుంకుమతో పెదిమలు, మరొక చిన్న పసుపు ముద్దతో ముక్కును అతికిస్తారు. శక్తిమేరకు బంగారు నగలతో అలంకరిస్తారు.

లక్ష్మీదేవిని పూజించేవారు ఆకుపచ్చ చీర ధరిస్తే శుభప్రదం. మానవుని శరీరంలో విద్యుత్ ఉంటుంది. అదే మనల్ని నడిపిస్తుంది. భూమికి ఆకర్షణ శక్తి ఎక్కువ. అందుకే పూజ చేస్తున్నప్పుడు, పీట పైన కూర్చుంటారు. నుదిటిపై కుంకుమ తిలకం వశీకరణ మంత్రం లాంటిది. అక్కడ ఉండే ఆజ్ఞాచక్రం మేల్కొంటుందని తన శక్తి ఊర్ధ్వ గామి అయి తేజస్సు పెరుగుతుందని నమ్మకం. శ్రీమహాలక్ష్మీ స్వరూపమైన దీపాన్ని ఎడమవైపు నువ్వులనూనెతో, కుడివైపు ఆవు నెయ్యితో వెలిగిస్తారు. దీపం హృదయంలోని అశాంతిని పోగొడుతూ చీకటిని దూరంచేస్తూ వెలుగు నింపుతుంది. ఏపనిని ప్రారంభించినా ముందు దీపారాధన చేయటం, పని విజయవంతం అవుతుందన్న పరమార్ధంతోనే. ఇక గణపతి, సర్వదేవతా ప్రార్థనతో పూజను ప్రారం భిస్తారు. స్త్రీ రూపానికి తగ్గట్టు స్వరమూ ఉండాలని గంధం రాస్తారు. మారేడు పూలు, సుగంధ పరిమళాలతో పూజిస్తారు. కొబ్బరి కాయపై ఉన్న పెంకు అహంకారానికి ప్రతీక, కొబ్బరికాయను ఎప్పుడైతే కొడతామో అహంకారాన్ని వీడుతుందని, లోపలున్న తెల్లని కొబ్బరిలా మన మనస్సును సంపూర్ణంగా దేవి ముందు పరిచామని తద్వారా నిర్మలమైన కొబ్బరినీరులా జీవితాలని ఉంచుతుందని అర్థం. కర్పూర హారతి ఎలా కరిగిపోతుందో, అలాగే మనం తెలిసీతెలియక చేసిన తప్పులు సమసిపోవాలని వేడుకుంటూ హారతిని కళ్లకద్దుకోవటమే అంతరార్థం. విధిరాతలన్నీ మన తలమీదే కదా రాసి ఉండేది. కర్మ ఫలాలన్నీ బ్రహ్మదేవుడిచేత లిఖితమై ఉన్నాయి. అందువల్లనే బ్రహ్మకపాలం అని చెపుతారు. ఇలా రాసిన విధిరాతలు, కర్మలు క్షీణించటానికి తలమీద అక్షింతలు వేసే ఆచారం వచ్చింది. లక్ష్మీదేవిని స్తుతిస్తూ, పూజిస్తూ నారింజ, జామ, ఖర్జూర ఫలాలను, పులిహోర, దద్ధ్యోజనం, పాయసం, శనగలు మొదలగు తొమ్మిది పిండివంటలు నైవేద్యంగా పెట్టి సాంబ్రాణి ధూపంతో, అగరు గంధాలను ప్రీతిగా సమర్పించి లక్ష్మీదేవిని పిలిస్తే, బొట్టుపెట్టి పిలిచినట్లు గృహాన్ని పావనం చేస్తుంది. నైవేద్యం పెట్టేటప్పుడు, మేలుకొలుపు పాడేటప్పుడు, హారతినిచ్చేటప్పుడు కొట్టే గంటకు అర్థం దేవత లందరినీ ఆహ్వానిస్తున్నామని, హారతివేళ దైవాన్ని ప్రత్యక్షంగా చూసినట్లై, ఆత్మప్రదక్షిణం అంటే తనలోని భగవంతుని చుట్టూ తాను తిరుగుతున్నాడన్నమాట. అంటే సమస్త ప్రాణుల హృదయంలో ఈశ్వరుడున్నాడని అర్థం. ప్రతి శుభకార్యానికి నాగవల్లిదళమనే తమలపాకు దేవతాదళం, తమలపాకు తొడిమలో లక్ష్మీదేవి,



మధ్యభాగాన పరమేశ్వరుని సతి పార్వతీదేవి..కొనభాగంలో విద్యాలక్ష్మి అయిన సరస్వతీదేవి, ఇంద్రుడు, మన్మథుడు, విష్ణువు, శివుడు, బ్రహ్మ తమలపాకుపై సదా కొలువుతీరి ఉంటారు. అందువల్లనే తాంబూలానికి ఎంతో ప్రాముఖ్యత ఉంది. తొలి తీర్థం శరీరశుద్ధి, శుచికీ..రెండవతీర్థం ధర్మ, న్యాయ ప్రవర్తనకు, మూడవ తీర్థం పవిత్రమైన పరమేశ్వరుని పరమపదం కొరకు.. వండుకొన్నది దేవికి నివేదన చేస్తే అదే దైవప్రసాదమవుతుంది. పూజ అనంతరం పూర్ణాలూ, గారెలతో ముత్తయిదువులకు వాయినాలు ఇచ్చి, తోరాలు కడితే అత్తింటి, పుట్టింటివారలకు శుభం.

స్త్రీ ముక్కెర ధరించటం వల్ల ముక్కుకొనపై ఏదోవిధంగా దృష్టి ఉంటుంది. అలా దృష్టి ఉండటం ధ్యానంలో ఒక భాగం. శిరోమధ్య ప్రదేశంలోచంద్రవంక ధరిస్తారు. అక్కడినుంచే మన జీవనాధారమైన ప్రాణవాయువు బ్రహ్మరంధ్రం నుంచి హృదయంలోకి ప్రవేశిస్తుంది. అందుకే ఆ బాగాన్ని కప్పి ఉంచుతారు. హృదయంలో పరమాత్ము డున్నాడన్న విషయాన్ని గుర్తించామని తెలుపుతూ కంఠానికి బంగారు హారాలు వేసుకోవడం ఆనవాయితీ. తెలిసీతెలియక చేసిన పాపాలను కూడా బంగారం పోగొడుతుంది. ముఖ్యంగా శుక్రునికి ఇష్టమైన ఈరోజున స్త్రీలువజ్రాల హారాలు, ముక్కుపుడక ధరించి లక్ష్మీదేవిలా కనబడతారు. చివరగా వరలక్ష్మీదేవికి మంగళ హారతులను పాడి తరిస్తారు. ■

## అనుమానం ప్రేమాంతకం

(15వ పేజీ తరువాయి)

'మీరు రాకపోతే ఆమె విరహాగ్నిలో దహించుకుపోతోంది. తన ప్రేమను నిరూపించుకొనేందుకు మీ అసూయాగ్నిలో దగ్ధమైపోతా నంటోంది.

'నాది అసూయకాదు. దగ్ధమవమను. బూడిదను చూసేందుకు కూడా రాను' కటువుగా అన్నాడు మహేంద్ర.

'అంత ప్రేమ ఏమైపోయింది?'

'మోసంలో ఆవిరైపోయింది. తమరు వెళ్లవచ్చు' అన్నాడు మహేంద్ర ముఖం తిప్పుకుంటూ.

'ఆవిరయ్యేది ప్రేమకాదు'

'మోసం చేసేదీ ప్రేమ కాదు'

అతడు తన మాటలు వినడని గ్రహించిన నాతిక తల వేలాడేసుకుని వెనుతిరిగింది.

********

రాజసభలో అన్యమనస్కంగా ఉన్న మహేంద్ర ఉలిక్కిపడ్డాడు.

ఎవరో ఏడుస్తూ సభలోకి దూసుకువచ్చారు.

'తన ప్రేమ నిరూపించుకునేందుకు మోమత అగ్నిలో దూకి ప్రాణత్యాగం చేస్తోంది'

'నిజమా?' అరిచాడు మహేంద్ర.

'నిజమే' మరో క్షణంలో లాగి విడిచిన బాణంలా రాజసభ వదిలాడు మహేంద్ర.

ఎవరు పిలిచినా వినిపించుకోలేదు.

అతడి మనస్సు అర్థంకాని ఆవేదనతో రగిలిపోతోంది.

ఆఘమేఘాలమీద కాకమహల్ చేరుకున్నాడు.

అక్కడ రగులుతున్న చితి, అవనత శిరస్కులై విషాదంగా నిలుచున్న మోమత సోదరిలను చూడగానే విషయం అర్థమయింది అతడికి.

'ఎంత పొరపాటు చేశాడు తను! ఎంత ప్రేమ ఉండీ ఏంలాభం? ఒక్క క్షణం నిలిచి ఆలోచించలేకపోయాడు. మోమాత మీద కోపంతో దూరం ఉండగలిగాడు. ఇక దూరంగా ఉండలేడు. ఎంత పని జరిగింది! అసూయ, క్రోధం విచక్షణను కప్పేశాయి. ప్రేమను ఓడించాయి'

'మోమతా' అరుస్తూ తాను నిప్పులో దూకాడు మహేంద్ర తన పాపాన్ని అగ్నితో ప్రక్షాళనం చేసుకుని, స్వచ్ఛమైన ప్రేమను సాధించేందుకు.

********

సింధి జానపద ప్రేమగాథ ఇది. కొద్దితేడాతో రాజస్థాన్ జానపదం లోనూ ఈ అత్యద్భుతమైన ప్రేమగాథ ప్రచారంలో ఉంది. ■



# అతడు... ఆమె

- కె.రాధాకృష్ణ

**అది వాళ్ల ముప్పై ఎనిమిదవ పెళ్లిరోజు. ఆయన వయసు అరవై అయిదు. ఆమెకు అరవై మూడు. ఆయన పేరు భానుప్రకాష్. ఆమె పేరు భానుమతి. ఇద్దరూ విశ్రాంత ఉద్యోగం జీవితం గడుపుతున్నారు. ఇద్దరి ఆనందదాయకమైన దాంపత్య జీవితంలో ఈ పెళ్లిరోజుకో ప్రత్యేకత ఉంది. తిథుల ప్రకారం ఈ పెళ్లిరోజునే భానుప్రకాష్ పుట్టినరోజు కూడ కలిసివచ్చింది.**

ఇంతవరకు జరిగిన అన్ని పెళ్లిరోజులలో రాత్రికి ఆమె శుభ్రంగా స్నానం చేసి కొత్త చీరలో తలనిండా మల్లెపూలతో చేతిలో పాలగ్లాసుతో నవ వధువులా వచ్చి భర్త పరిష్వంగంలో చేరేది. అవన్నీ వాళ్లకు మధురమైన రోజులే. మరపురాని శుభరాత్రులే.

ఈ పెళ్లి రోజు రాత్రి కూడ భానుప్రకాష్ భార్య ప్రియాగమనంకోసం తమ పడక గదిలో నిమిషాలు లెక్కపెడుతూ నిరీక్షిస్తున్నారు. వంటింట్లో అన్నీ సర్దుకొని, బాత్ రూమ్‌లో కాళ్లు, చేతులు, ముఖం శుభ్రంగా కడుక్కొని చీర మార్చుకొని చేతిలో గ్లాస్‌తో గదిలోకొచ్చింది భానుమతి. తల ఎత్తి చూసిన భానుప్రకాష్‌కు భార్యలో ఈ రోజు ప్రత్యేకతేమీ కనిపించలేదు. రోజూలాగే ఉంది. ఆమె దగ్గరకొచ్చి స్టూల్‌పై నీళ్ల గ్లాసునుంచి, పక్కనే ఉన్న మందు బిళ్లను తీసి భర్తవైపు సాచింది.

అతను మాట్లాడకుండా మందుబిళ్లను గొంతులో వేసుకొని గ్లాసులోని నీళ్లతో గుటుక్కున మింగాడు. భార్యను చూస్తూ "ఏం ఇంకా ఇలానే ఉన్నావు" అన్నట్టు కళ్లెగరేస్తూ చేతిని ఊపాడు.

ఆమె కూడ "ఏం! బాగానే ఉన్నాను కదా! ఏమయ్యింది?" అన్నట్టు కళ్లు చికిలించి తను కూడ చేతినూపింది.

ఇక లాభం లేదని "ఏం రాణిగారికి ఈ రోజు ప్రత్యేకత గుర్తున్నట్లు లేదు, మామూలుగానే వచ్చారు" అంటూ భానుప్రకాష్ భార్య చేతినందుకొని మీదకు లాక్కొన్నాడు.

"ఎందుకు గుర్తులేదు. మారాజుగా గుర్తుంది. తమకే గుర్తున్నట్లు లేదు, తమ ఆరోగ్యం సంగతి"



అంది, ఆమె మంచంపై భర్తపక్కనే ఆసీనురాలవుతూ.

ఆమె భర్త విశాలమైన ఎదను సున్నితంగా చేత్తో నిమిరింది. అక్కడే తనకు కావలసినదేదో ఉందన్నంత ఇదిగా, పరవశంగా.

సరిగ్గా నెలరోజుల క్రితం భానుప్రకాష్‌కు ఓ మాదిరి హార్ట్ ఎటాక్ వచ్చింది. వెంటనే డాక్టర్లు యాంజియోగ్రామ్ చేసి ఒక స్టంటు వేసారు. ఇప్పుడిప్పుడే కోలుకొని పూర్వపు స్థితికి వస్తున్నాడు. బెంగళూరులో ఉన్న కూతురు, హైదరాబాద్‌లో ఉన్న కొడుకు వచ్చి చూసి వెళ్లారు. పిల్లలిద్దరూ తమతో రమ్మని ఎంత బలవంతం చేసినా, ఇక్కడే డాక్టర్ల పర్యవేక్షణ బాగుందని భానుప్రకాష్ పిల్లలకు సర్దిచెప్పి పంపించాడు.

"ఇప్పుడేమయింది. బాగానే ఉన్నాను కదా! ఎన్నాళ్లిలా?" అంటూ పక్కకి తిరిగి ఆమెను రెండు చేతులతో చుట్టేశాడు భానుప్రకాష్.

"నేను మీ పక్కనే ఉన్నాను కదా! ముందు మీ ఆరోగ్యం చక్కపడనీ" అంటూ ముందుకు వంగి అతని పెదాలను సుతిమెత్తగా చుంబించి, పక్కనే పడుకుంటూ "ఇక తమరు కళ్లు మూసుకోండి" అంది.

ఇద్దరూ తమ జీవితంలో జరిగిన ఎన్నో శుభ సంఘటనలను గుర్తు చేసుకొని మురిసిపోయారు.

"మన పెళ్లిచూపులనాడు నువ్వు పెట్టిన ఆ షరతులు గుర్తుకొస్తే ఇప్పటికీ నాకు నవ్వు వస్తుంది" అన్నాడు భానుప్రకాష్ ఆమె కళ్లల్లోకి చూస్తూ.

ఆ రోజులు గుర్తుకొచ్చాయి భానుమతికి.

"అప్పుడేమన్నావ్? నీ షరతులనప్పటికి అంగీకరించి తరువాత వాటిని ఖాతరు చేయకపోతే మీ ఇంటికి తిరిగి వెళ్లిపోతావా? లేదా ఎక్కడికైనా పోతావా? ఇన్నేళ్లైనా, ఇప్పటికీ అంతేనా?" అని ప్రశ్నించాడు ఆమె ముక్కును చిలిపిగా గిల్లి భానుప్రకాష్.

"ఔను. ఎప్పటికైనా అంతే! ఇప్పుడు మిమ్మల్ని వదిలేసినా నా పిల్లల దగ్గరికెళ్లిపోతా... జాగ్రత్త" అని తర్జని చూపింది భానుమతి.

"అప్పుడున్న నా పరిస్థితికి ఏ కన్నెపిల్లా నన్ను చేసుకోవడానికి ముందుకు రాదు. అపనమ్మకంతోనే పెళ్లి ప్రస్తావన తెస్తే, షరతులు నిబంధనలు పెట్టడమేగాక, భవిష్యత్తులో వాటిని గురించి ప్రశ్నిస్తే గంగాదేవి శంతన మహారాజును వదలిపెట్టి వెళ్లిపోయి నట్లు వెళ్లిపోతానని బెదిరింపులు. అప్పటి నా పరిస్థితికి నేనన్నిటికీ ఒప్పుకొన్నాను. అయినా నీకేమయ్యింది. నాకన్నా నీకు ఇంకా మంచి సంబంధాలే వచ్చి ఉండేవి. నీవు పొందవలసిన ఎన్నింటినో వదలుకొని నా జీవితంలోకి ఎందుకు ప్రవేశించావు. ఈ పెళ్లి రోజున అదేదో చెప్పాల్సిందే. ప్లీజ్ చెప్పు" అడిగాడు భానుప్రకాష్ అభ్యర్థనగా ఆమె కళ్లల్లోకి చూస్తూ.

"చెప్పడానికేముంది గాడిదగుడ్డు. ఏమీ లేదంతే! కళ్లు మూసుకొని పడుకోండి.

ఇప్పటికే అర్ధరాత్రి కావస్తున్నది" అని మురిపెంగా కసరిస్తూ అవతలికి తిరిగి దుప్పటి మీదకు లాక్కుంది ఆమె.

"చూడు భానూ! మనం దాదాపు జీవితపు చివరి దశకు చేరుకున్నాం. ఇంకా ఎన్నాళ్లుం టామో తెలీదు. ఇంతకుముందు ఒకటి రెండుసార్లు ఆ ప్రస్తావన వచ్చినపుడు వెళ్లిపోతానని బెదిరించావు. ఇప్పటికైనా నీ జీవితంలోని ఆ చిదంబర రహస్యపు ముడి విప్పు. లేకుంటే అదేదో తెలీకుండానే తీరని కోరికతో పోతానేమోనని భయపడుతున్నాను" కావాలని గొంతులో బాధను వ్యక్తం చేస్తూ ఆమెను తన వైపుకు తిప్పుకున్నాడు భానుప్రకాష్.

అప్పటి ఆ రోజులు ఆమె కళ్లముందు కదలాడాయి.

తను డిగ్రీ పూర్తి కాగానే బి.ఇడి. చేసింది. ఆ వెంటనే డిఎస్‌సిలో సెలెక్టయి స్కూల్ అసిస్టెంట్ ఉద్యోగం పొందింది. తల్లిదండ్రు లకు భానుమతి ఒకతే కూతురు. తండ్రిది ప్రైవేట్ ఉద్యోగం. తండ్రి జీతం సంసారం గడపడానికి, తన చదువుకు అతికష్టంగా సరిపోయేది. పెద్దల నుండి సంక్రమించిన ఇల్లు తప్ప వెనుక ఏ ఆస్తులూ లేవు. తండ్రి రిటైర్ అయితే వచ్చే పియఫ్, పెన్షన్ ఎందుకూ సరిపోదు. ఎలాగైనా తను ప్రభుత్వ ఉద్యోగం సంపాదించి తల్లిదండ్రు లకు ఆసరాగా నిలబడాలని దీక్షతో చదివి అనుకున్నది సాధించింది.

భానుమతి ఎత్తుకు తగ్గ లావుతో ఒకసారి చూస్తే మళ్లీ చూడాలనే అందంతో మెరిసి పోతూ ఉంటుంది. ఉద్యోగం వచ్చిన తరు వాత ఆమె అందం మరింత ద్విగుణీకృతమ య్యింది. బంధువర్గంనుండి, మిత్ర బృందా లనుండి సంబంధాల రాక మొదలయ్యింది. భానుమతికి ఎందుకో పెళ్లిపై ఆసక్తి లేదు. కారణం చెప్పేది కాదు. ఏదో భయం.

తల్లిదండ్రుల నుండి, బంధువులనుండి పెళ్లికి వత్తిడి ఎక్కువయ్యింది. రాష్ట్రంలో పని చేస్తున్న గ్రూప్-1 ఆఫీసర్ సంబంధం ఒకటి వచ్చింది. ఏ కారణం చెప్పలేక తను పెళ్లిచూపులకు ఒప్పుకుంది. పెళ్లికొడుకు అందంగా ఉన్నాడు. మంచి ఉద్యోగం. మంచి జీతం. తను ముందుగా ఆలోచించి పెట్టుకుని అబ్బాయితో విడిగా మాట్లాడా లంది. ఆమె చొరవకు అబ్బాయి ఆశ్చర్యపోయినా నవ్వుతూ ఆమె వెంట గదిలోకి నడిచాడు. ఇద్దరూ ఎదురెదు రుగా కూర్చున్న తరువాత భానుమతిని చూస్తూ "చెప్పండి" అన్నాడు పెళ్లికొడుకు.

ఆమె ఏ తొట్రుపాటు లేకుండా "ఈ పెళ్లికి నాకు కొన్ని భయాలు, షరతులు ఉన్నాయి. మీరు వాటిని ఒప్పుకుంటే నాకు పెళ్లికి అభ్యంతరం ఉండదు" చెప్పింది.

"నాకు మీలాగా ఫ్రాంక్‌గా మాట్లాడేవాళ్లం టేనే ఇష్టం. ముందు మీ భయాలు పోగొట్టి, షరతులెంతవరకు ఆమోదయోగ్యమో ఆలోచి స్తాను. చెప్పండి అవేమిటో!" అన్నాడు అతను కాస్త ముందుకు వంగి ఆసక్తిగా.

"అన్నింటికంటే ముందు మా అమ్మా, నాన్నల గురించి. నేను తప్ప వాళ్లకెవరూ లేరు. నేను చేసుకోబోయేవారు నా తల్లిదండ్రులను అవసరమైతే వారిని నాతో ఉండనిస్తారా?" అన్నది భయం!" చెప్పి ఆగింది ఆమె.

"ఇందులో భయపడాల్సిందేమీ లేదు. నాది పెద్దలను గౌరవించే స్వభావం. అత్తా, మామలను నా తల్లిదండ్రులుగా గౌరవిస్తాను. అందుకు నాకు అభ్యంతరం లేదు" అభయ మిచ్చాడు.

"తరువాత నా తల్లిదండ్రులు కట్నమిచ్చే స్థితిలో లేరు. నేను కూడ వరకట్న వ్యతిరే కిని. కాబట్టి కట్నం లేకుండా పెళ్లికి ఒప్పుకో వాలి. ఇది నా మొదటి షరతు" చెప్పింది, భానుమతి.

"కట్నం గురించి నేను మాట్లాడను. ఎందుకంటే ఇది పెద్దలకు సంబంధించినది. వాళ్లకేవో ఆశలు, కోరికలు ఉంటాయి. ఇంతకుముందు నేను చూసిన సంబంధాలలో ఈ విషయంలోనే కుదరకపోయినవి కూడ ఉన్నాయి. నన్ను పెంచి పెద్ద చేసి, నా ఈ స్థాయికి కారకులైన నా తల్లిదండ్రుల అభిప్రా యాలను మన్నించటం కొడుకుగా నా ధర్మ మని భావిస్తాను. అయితే మిమ్మల్ని చూసిం తరువాత మీరు నాకు చాల నచ్చారు. అందుకని మీరు కూడ మా తల్లిదండ్రుల

**"నా తల్లిదండ్రులు కట్నమిచ్చే స్థితిలో లేరు. నేను కూడ వరకట్న వ్యతిరేకిని. కాబట్టి కట్నం లేకుండా పెళ్లికి ఒప్పుకోవాలి. ఇది నా మొదటి షరతు" చెప్పింది, భానుమతి.**

అభిప్రాయాలకు విలువ ఇచ్చి వాళ్లడిగే కట్నకానుకల్లో ఎంతో కొంత ఒప్పుకోండి. నేను దానికి మా వాళ్లను ఒప్పిస్తాను" చెప్పాడతను.

"దయచేసి నన్ను క్షమిం చండి. కట్నం విషయంలో రెండో మాట లేదు. అత్తామామలను తల్లిదండ్రులుగా భావిస్తూ గౌరవంగా, ప్రేమగా చూసుకొంటాను, వారు నా షరతుకు ఒప్పుకొంటే" తన అభిప్రాయం నిష్కర్షగా చెప్పింది భానుమతి.

"కట్నం మీ మొదటి షరతన్నారు. ఇంకా ఏ షరతులున్నాయో చెప్పండి" వ్యంగ్యంగా అడిగాడతను.

"ఇదే మీకు ఒప్పుదల కానప్పుడు, ఇక మిగతా వాటితో పని లేదనుకుంటాను" చెప్పి కుర్చీలోంచి లేచింది.

"సరే. ఇప్పటికీ నాకు మిమ్మల్ని వదలు కోవాలని లేదు. మా అమ్మా-నాన్నలతో చర్చించిన తరువాత మీ తరువాతి షరతుల ను వినడానికి రాగలనని ఆశిస్తున్నాను" అంటూ అతడూ లేచాడు.

"మీరు రాగలిగితే హృదయపూర్వకంగా ఆహ్వానిస్తాను" అని ముందుకు కదిలింది భానుమతి.

అంతే! ఆ సంబంధం మళ్లీ రాలేదు. భానుమతి కోరుకున్నది అదే.

కొన్నాళ్ల తరువాత మరో సంబంధం వచ్చింది. అబ్బాయి రైల్వేలో ఇంజినీర్. దీనికి ఏ వంక చెప్పలేక పెళ్లి చూపులకు కూర్చుంది భానుమతి.

ఇది కూడ కట్నం దగ్గర వెనక్కెళ్లిపో యింది. ఇలాగే మరో రెండు సంబంధాలు వెనుదిరిగాయి. ఈ విషయంలో ప్రచారం జరిగి కొన్ని సంబంధాలు రాకుండా ఆగిపో యాయి. ఆమెకిదే బాగుంది.

అయితే కొన్నాళ్ల తరువాత తను పని చేస్తున్న స్కూల్లో కొత్తగా వచ్చిన కొలీగ్ ఒకతను భానుమతిని చూసి మనసు పారే సుకున్నాడు. కొలీగ్ ద్వారా సంప్రదింపులు చేశాడు.

అతడు కేంద్ర ప్రభుత్వోద్యోగి. భానుమతి ఇష్టపడలేదు. భానుమతి విషయం చూచాయగా తెలిసి అతను, ఆమె పెట్టే షరతులెలాంటివైనా తను ఒప్పుకోవడానికి సిద్ధంగా ఉన్నానని, ఒకసారి కలవడానికి అవకాశమివ్వమని వర్తమానం పంపాడు. తప్పనిసరై భానుమతి అతన్ని కొలీగ్‌తో కలిసి కాఫీ బార్‌లో మీటయ్యింది.

అతను ఏ భేషజాలకు పోకుండా "నాకు కట్నం అక్కరలేదు. అత్తా, మామల బాధ్యతను కూడా స్వీకరిస్తాన"ని చెప్పాడు.

**"ఏం భానూ! నేనడుగుతుంటే ఏ లోకాలకెళ్లిపోయావు చెప్పు" అంటూ ఆమెను కదిలించాడు భానుప్రకాష్.**

**ఆమె ఉలిక్కిపడి ప్రస్తుతంలోకి వచ్చి భర్తవైపు చూసి నవ్వి "పడుకోండి. నాకు నిద్ర వస్తోంది" అని కళ్లు మూసుకుంది.**

ఒక నిమిషమాగి భానుమతి అతని కళ్లలోకి సూటిగా చూస్తూ "మీకు పిల్లలంటే ఇష్టమా?" అని అడిగింది.

"పిల్లలంటే ఇష్టంలేనివారెవరుంటారు? నాకు చాలా ఇష్టం. ఆడ యినా మగయినా నాకు తేడా లేదు. ఇద్దరికంటే ఎక్కువైనా నాకు ఒకే" అన్నాడు ఉత్సాహంగా 'సంతాన విషయంలో మీ ఓపిక' అన్నట్లు కళ్లెగరేస్తూ.

"కానీ నేను పిల్లలకోసం గర్భం మోస్తూ తిరగలేను. కాన్పులంటే నాకు చచ్చేంత భయం. నా తరువాతి షరతు ఇదే. మీరు వాసెక్టమీ చేయించుకోవాలి. ఆ తరువాతే పెళ్లి. పిల్లలు కావాలంటే ఎవరినైనా పెంచుకుందాం. ఒకరు కాకుంటే ఇద్దరు" చెప్పింది కచ్చితంగా, కిటికీలో నుండి బయటకు చూస్తూ.

ఆమె మాటలకతను ఆశ్చర్యపోయాడు. "ఇది వినడానికే విడ్డూరంగా ఉంది. స్త్రీలలో ఇలాంటివారు కూడ ఉంటారా? ఆడదానికి మాతృత్వంతోనే నిండుదనం వస్తుందంటారు. మీరేంటిలా ఆలోచిస్తున్నారు. పరిహాసానికే ఇలా అంటున్నారా? నిజం చెప్పండి... లేదా నన్నేలాగైనా అవాయిడ్ చెయ్యాలని ఇలా అంటున్నారా?" అడిగాడు.

"లేదు. నేను నిజమే చెబుతున్నాను. నేను చెప్పిందానికి మీకు ఒకే అయితే నాకు కూడ ఒకే" చెప్పింది.

"నేనెంతో ఆశతో వచ్చాను. ఇదే మీ ఆఖరి మాటా?" అడిగాడు చివరి ప్రయత్నంగా అతను.

"ఔను..." అన్నట్లు తలూపి కదలకుండా కూర్చుంది భానుమతి. అయితే నా ప్రయత్నం ఫెయిలయ్యింది. నా ఆశ నెరవేరలేదు. నా మాట మన్నించి ఇక్కడిదాక వచ్చినందుకు ధన్యావాదాలు. వస్తాను.. బై" అని చెప్పి అతను తన కజిన్ కూర్చుని వున్న వైపు అడుగులేశాడు.

ఆ తరువాత ఇది ప్రచారమై అందరూ భానుమతిని వింత మనిషిలా చూడసాగారు. తల్లిదండ్రులు బాధపడ్డారు.

కొన్ని నెలలు ఈ పెళ్లి గొడవలు ఆగిపోయాయి.

మరికొన్నాళ్ల తరువాత వీళ్ల ఇంటిపక్కన కొత్తగా కట్టిన ఇంట్లోకి బ్యాంక్ ఆఫీసర్ ఒకాయన చేరాడు. అతనితోపాటు అతని తల్లి, మూడేళ్ల బాబు, సంవత్సరం పాప ఉన్నారు. భార్య లేదు. ఆమె ఆర్నెల్ల క్రితం ఏదో జబ్బు చేసి మరణించిందట. రెండిండ్ల మధ్య రాకపోకలు మొదలయ్యాయి. పిల్లలిద్దరూ ముద్దుగా ఉన్నారు. పిల్లలు భానుమతికి కొంచెం అలవాటయ్యారు. అటు, ఇటు పెద్దలు వీళ్లను ఒకటి చేయాలని ఆలోచించారు. పెళ్లిచూపులని కాకపోయినా ఒకరోజు పెద్దలు వీళ్లకు ఆ అవకాశం కల్పించారు.

పెద్దల ద్వారా కొంతవరకు విషయం గ్రహించిన బ్యాంక్ ఆఫీసర్ ఏ ఉపోద్ఘాతం లేకుండా "చూడండి భానుమతిగారూ! మీ భయాలు, షరతుల సంగతి నాకు తెలిసింది. నా ప్రస్తుత పరిస్థితి కూడా మీకు తెలుసు. మీరు చెప్పే అన్నింటికీ నేను సమ్మతిస్తున్నాను. కావాలంటే రాసిస్తాను. ఎలాగు నాకు పిల్లలున్నారు కాబట్టి మనం వేరే ఎవరినో పెంపకానికి తెచ్చుకునే పని లేదు. పాప పుట్టి మూడు నెలల్లోగానే నేను వాసెక్టమీ చేయించుకున్నాను. మీ ఆలోచనలకు అనుగుణంగానే ఉన్నాననుకుంటున్నాను. నాతో పెళ్లికి మీకిష్టమేనా?" అడిగాడు.

ఆమె ఏమి చెబుతుందా? అని ఆమె వైపే ఆతృతగా చూస్తున్నాడతను.

అతనికి నిరాశ కలిగించడానికి ఆమెకు ఏ కారణం తోచలేదు. తను ఇన్నాళ్లు ఎదురుచూసింది ఇలాంటి సంబంధంకోసమేనా అనిపించింది. తన సమస్యలకన్నింటికి ఇదే పరిష్కారమనుకొని తల ఎత్తి అతని కళ్లలోకి చూస్తూ 'సరే' నన్నట్లు తల పంకించి సహజమైన సిగ్గుతో మళ్లీ తల దించుకుంది.

అతను ఆనందంగా "థ్యాంక్స్ భానుమతి... థ్యాంక్స్" అని ఆమె రెండు చేతులు పట్టుకున్నాడు.

"పెళ్లయ్యేవరకు మీ మగవాళ్లు ఇలాగే మాట్లాడుతారు. పెళ్లవగానే మీ నిజ్వరూపం బయట పెడతారు. కానీ నా విషయంలో మాత్రం చాల స్ట్రిక్ట్. మీరెప్పుడైనా, ఏ సందర్భంలోనైనా, ఎన్నేళ్లకైనా అప్పుడు అలాంటి షరతులెందుకు పెట్టావు? దీనివెనుక గల రహస్యమేమి?అని నన్ను ప్రశ్నించకూడదు. అలా ఆరా తీస్తే మాత్రం నేను నిర్మొహమాటంగా మిమ్మల్ని వదలి వెళ్లిపోతాను. ఇది ఎప్పటికే గుర్తుంచుకోండి" దృఢంగా చెప్పింది భానుమతి.

ఆ తరువాత అయినవాళ్లందరి మధ్య ఆనందంగా భానుమతి- భానుప్రకాష్‌ల పెళ్లి జరిగింది.

"ఇంతవరకు ఎందరికో రాని అన్ని మంచి సంబంధాలొస్తే తన పిచ్చి షరతులతో తిరస్కరించి, కడకు రెండో పెళ్లివాణ్ణి అదీ ఇద్దరు పిల్లలున్నవాణ్ణి కట్టుకుంది. ఇలాంటి వాళ్లకు ఇలాగే జరగాలి. తిక్క కుదురుతుంది" కొందరనుకునే మాటలు భానుమతి చెవిలో పడ్డాయి. తను విని నవ్వుకుంది.

"ఏం భానూ! నేనడుగుతుంటే ఏ లోకాలకెళ్లిపోయావు చెప్పు" అంటూ ఆమెను కదిలించాడు భానుప్రకాష్.

ఆమె ఉలిక్కిపడి ప్రస్తుతంలోకి వచ్చి భర్తవైపు చూసి నవ్వి "పడుకోండి. నాకు నిద్ర వస్తోంది" అని కళ్లు మూసుకుంది.



భానుప్రకాష్ మాత్రం పట్టు వదలని విక్రమార్కుడిలా "ఈ రోజు మాత్రం నువ్వు చెప్పి తీరాల్సిందే. ఎన్నో మంచి సంబంధాలు వచ్చినా ఇద్దరు పిల్లలున్న నన్ను మరీ ఎంచి చేసుకున్నావు. ఎందుకు? నా పిల్లల కోసం నీ మాతృత్వాన్ని సైతం త్యాగం చేయాల్సిన అవసరమేమొచ్చింది? నాకు తెలియాలి. ఈ రహస్యం తెలియకుండానే తీరని కోరికతో పోతానేమోనని భయంగా ఉంది. చెప్పు భానూ! ప్లీజ్" అంటూ ఉద్వేగానికి లోనై ఎదలో ఎక్కడో కలుక్కుమంటే గుండె పట్టుకున్నాడు.

భానుమతి వెంటనే ఆందోళనగా లేచి "ఏంటండీ ఇది... మరీ చిన్నపిల్లాడిలా. ఊరకే ఆవేశపడుతున్నారు. మళ్లీ గుండెనొప్పి వచ్చిందా ఏంటి?" అని ఆదుర్దాగా అతని గుండెలపై అరచేతితో రుద్దసాగింది.

భానుప్రకాష్ కొంతసేపటికి కోలుకొని లేచి కూర్చుని నీళ్ల తాగి ఆమెవైపు చూసి కన్ను గీటి "నిన్నొదిలి నేనెక్కడికి పోతాను. నా గుండె గట్టిది. దానికేమీ కాదు. అయితే దానికి తెలుసుకోవాలనుంది. నా జీవితంలో వెలుగులు నింపిన నీ జీవితంలో దాచుకున్న ఆ రహస్యమేంటి? ఈ ప్రశ్న కొన్ని రోజులుగా నన్ను వెంటాడుతున్నది. చెప్పు భానూ! ప్లీజ్! నా మనసుకు కొంత ప్రశాంతత కల్గుతుంది" అడిగాడు ప్రాధేయపడుతున్నట్లు.

భానుమతికి ఇక తను బయట పడిపోయే రోజు దగ్గరకొచ్చిందని అర్థమయ్యింది. మనసులో ఆవేదన పెల్లుబుకగా నిగ్రహించుకుంటూ భర్త చేతులను తన చేతుల్లోకి తీసుకొని "మీరు నన్ను మన్నించాలి. నేను రెండు విషయాలు మీ నుండి, ఈ లోకం నుండి దాచాను. గత్యంతరం లేకనే నేనలా చేయాల్సి వచ్చింది. మీరు అపార్థం చేసుకోకూడదు. మీరు ఈ విషయం తెలుసుకోవాలని ఎంత తాపత్రయపడుతున్నారో నాకు తెలుసు. ఇన్నాళ్ల బిగించిన గుప్పిటను విప్పడానికి నాకు కష్టంగా ఉన్నా మీ కోసం ఆ గుట్టును బయట పెడతాను" అని చెప్పి రెండు నిమిషాలు కళ్ల మూసుకుంది.

"నాకు వయసు పదిహేను నిండి పదహారు పడింది. నేనప్పుడు టెన్త్ క్లాస్ చదువుతున్నాను. అమ్మకు నా వయసు ఎదుగుదల మీద ఎందుకో అనుమానం. రెండు, మూడు సార్లు నన్నేదో అడిగింది. నాకలాంటిదేదీ కాలేదని చెప్పాను. ఒకసారి నన్ను గైనకాలజిస్టు దగ్గరకు తీసుకెళ్లింది. డాక్టర్‌గారు నాకేవో పరీక్షలు చేసారు. నేను ఏమయ్యిందోనని భయపడ్డాను.

డాక్టరుగారు నన్ను మా అమ్మను కూర్చోబెట్టి విషయం వివరించారు. ఈ కాలంలో అందరు ఆడపిల్లలు సాధారణంగా పన్నెండు నుండి పధ్నాలుగేళ్లలోపు రజస్వలవుతుంటారట. కాని నా విషయంలో అలా జరగలేదు. కారణం- నా గర్భసంచి నిర్మాణంలో లోపం. అది కుంచించుకుపోయిందట. అందువల్ల అండోత్పత్తికి ఆటంకం కల్గి రజస్వల అయ్యే అవకాశం పూర్తిగా కోల్పోయినట్లు చెప్పారు. జన్యులోప కారణాలుగా వేలలో ఎవరికో ఒకరికి ఇలా అవుతుందట. వారికి ఈ జన్మకు సంతాన ప్రాప్తి యోగం ఉండదట. అయితే అందరు స్త్రీలలా మాత్రం వీరు దాంపత్య జీవితం గడుపవచ్చునని, అందులో అనుమానపడవలసిన పని లేదని చెప్పారు.

ఇంటికొచ్చిన తరువాత మా అమ్మ నన్ను పట్టుకొని ఏడ్చేసింది. మా అమ్మ తనకు సన్నిహితంగా ఉండే ఒకామెతో నాకొచ్చిన కష్టం గురించి చెప్పుకుంది. ఆమెద్వారా అది కాస్త నలుగురికి తెలిసిపోయింది. వాళ్ల నన్ను చూసి నవ్వుకునేవారు. నేను బయట కెళ్లడానికే భయపడేదాన్ని. ఒకసారి ఎవరో వెనకనుండి నన్ను "శిఖండి" అని గేలి చేసారు. తట్టుకోలేక నేను ఆత్మహత్యా ప్రయత్నం చేసాను. మా అమ్మ నాకు ధైర్యం చెప్పి, దానికో పరిష్కారం మార్గం ఆలోచించింది.



సిటీలో చిన్న ఆపరేషన్ ద్వారా నేను అందరి ఆడపిల్లల్లా మారిపోగలనని అందరికి తెలిసేలా చేసింది. అదేవిధంగా మేం ఓ వారం రోజులు బయటకు వెళ్లివచ్చాం. తిరిగి వచ్చాక నేను రజస్వల అయినట్లు మా అమ్మ ఇంట్లో ఓ ఫంక్షన్ చేసింది. నా శరీరాకృతి కూడా అందరి అమ్మాయిల్లా కొత్త అందాలు సంతరించుకుంటుంటే ఎవరికీ ఏ అనుమానాలు రాలేదు. అప్పటినుండి నేను అందరిలాగే నెలలో మూడు, నాలుగు రోజులు అయిష్టంగానే నాకు బహిస్టు వచ్చినట్టు నాటకమాడటం మొదలుపెట్టాను.

అవయవ లోపంతో పుట్టే పిల్లలు తోటి వాళ్ల మధ్య వాళ్లలా ఉండలేక, వాళ్ల చూసే చిన్నచూపులను భరించలేక ఎంతటి మానసిక వ్యధకు గురవుతున్నారో చెప్పలేం. ఇక ఆడపిల్లల విషయం లోనైతే ఇది మరింత దయనీయంగా ఉంటుంది. ఈ మధ్య ప్రభుత్వాల సహకార, ప్రోత్సాహకాల వల్ల వీళ్ల సంఘంలో కొంత గౌరవాన్ని, ఆర్థిక సహాయాన్ని పొందుతున్నారు. మరి.. నా లాగా బయటకు కనపడని శరీర అవయవ లోపం ఉన్న ఆడపిల్లల సంగతేంటి? వీళ్ల తమలో తాము కుమిలిపోవడం తప్ప తమ కష్టాన్ని బయటకు చెప్పుకోలేరు, అందరిలా సాంసారిక జీవితం గడపలేరు.

ఈ కాలంలో అన్నీ సవ్యంగా ఉంటేనే ఆడపిల్లలను అందలమెక్కిస్తారు. లేదంటే అదెంత నరకప్రాయంగా ఉంటుందో అనుభవించే వారికే తెలుస్తుంది.

నా పెళ్లి ప్రయత్నాలు మొదలయ్యాక అందరిలా సవ్యంగా లేకపోబట్టి ఏవేవో షరతులు పెట్టి ఎందరి దగ్గర భంగపడ్డాను, ఎన్ని అవమానాలు భరించాను. ఇవన్నీ ఎవరితోనూ చెప్పుకోలేక ఎంత బాధపడ్డానో, ఎన్ని నిద్ర లేని రాత్రులు గడిపానో.. అది నాకే తెలుసు. ఇంత దుర్భరమైన జీవితం ఏ ఆడపిల్లకు రాకూడదు" గొంతు గద్గదమై వచ్చే దుఃఖాన్ని బలవంతంగా దిగమింగి కారిపోతున్న కన్నీళ్లను చీరచెంగుతో ఒత్తుకుంది.

రెండు నిమిషాలాగి తేరుకొని "పది పన్నెండేళ్ల క్రితం వరకు ఆ వంకతోనే మిమ్మల్ని నెలలో మూడు, నాల్గు రోజులు నా నుండి దూరం పెట్టాను. ఆ సమయంలో అబద్ధమాడుతున్నందుకు నేనెంత విలవిలాడిపోయేదాన్నో మీకు తెలీదు. తరువాత మెనోపాజ్ వచ్చిందని చెప్పి అన్నేళ్ల పడిన అవస్థ నుండి విముక్తి పొందాను. పరిస్థితులేవైనాగానీ, మీరు ముందుకొచ్చి నా పిచ్చి షరతులకంగీకరించి నన్ను పెళ్లి చేసుకొని ఆ కష్టాలనుంచి నన్ను గట్టెక్కించారు. ఇప్పుడవన్నీ మీతో చెప్పుకుంటుంటే కొంత రిలీఫ్‌గా ఉన్నా సిగ్గుతో చచ్చిపోతున్నాను" భారంగా, బాధగా చెప్పి ఉబికి వస్తున్న కన్నీళ్లను తుడుచుకుంటూ భర్త వడిలో వాలిపోయింది భానుమతి.

"పిచ్చిదానా! ఇందులో నీ తప్పేముందని అంతగా బాధపడుతున్నావు. అంతా నాకు చెప్పేశావు కదా! ఇన్నాళ్లూ నీలో దాగి ఉన్న ఆ రహస్యమేంటని రకరకాలుగా ఆలోచిస్తూ మదనపడ్డాను. ఓస్! ఇంతేనా? అని ఇప్పుడు నాకెంత ప్రశాంతంగా ఉందని. నువ్వు కూడ ఏ దిగులు పెట్టుకోకుండా మన పెళ్లిరోజున హాయిగా పడుకో!" అని ఆప్యాయంగా ఆమెను మరింత దగ్గరికి తీసుకొని ప్రేమగా ఆమె వీపు నిమురుతూ ఆలోచిస్తూ అలాగే చాలాసేపు కూర్చున్నాడు భానుప్రకాష్. కాసేపు తర్వాత ఆమె తీరిన భారంతో సుఖంగా నిద్ర పోతున్నదని భావించి మెల్లగా పక్కకు జరిపి నిండుగా దుప్పటి కప్పాడు.

తాను ఇన్నాళ్లు పడిన మనోవ్యథ తీరిందనో లేక పెళ్లికి ముందు భర్తతో తన షరతుల గురించి ప్రశ్నిస్తే అందరినీ వదలి వెళ్లిపోగలనని చెప్పింది నిజం చేయడానికో మరి భానుమతి మాత్రం మర్నాడు ఉదయం మళ్లీ నిద్ర నుండి లేవలేదు. ■

# ఈ వారం కవిత్వం

## కర్తవ్యం

**రాలి**పోయిన
పూలనేం జూస్తావ్
మూగవోయిన
రాగాలను సవరించినట్టు.
వికసించాల్సిన
మొగ్గలను వదిలేసి
గతాన్ని
కన్నీటి మడుగు జేస్తావ్!

'ప్రస్తుతం'
మొక్కే కావొచ్చు
లక్ష్యాల మడుల్లో
ఆశయాల అమృతం వొంపి
ఆచరణ పయనం సాగించు.

మొగ్గలన్నీ ఎన్ని పువ్వులౌతాయో
దారులన్నీ ఎంత
పరిమళభరితమవుతాయో!

– రమణ వెలమకన్ని

## సమానత్వం

**వివక్షా** వైతరణితో
మాది వైవాహిక జీవనం.
మాకు జనన మరణ వలయం
నుంచి విముక్తి ప్రసాదించకు
మమ్ములను ఖండ ఖండాలుగా
నరికిన చేతులను నరకాలనుంది.
మాపై వివక్షా శంఖం పూరిన
వాడికి లఘు శంకాభిషేకం
చేసేవరకు మాకు పునర్జన్మ యివ్వు.

మా శవాలను గంగా తీరాన కాల్చి
మా చితాభస్మం వాటిలో కలిపి
మాకు ద్రోహం చేయకు.
ఇంకా సమానత్వం సాధించలేదు
ఇంకా వివక్ష పోలేదు.
మరో జన్మ కావాలి
మరల మరల పుట్టాలి.
పక్షపాత మహావృక్ష మొదళ్లలో
యూరిక్ ఆసిడ్ పోసేవరకు
మేం నిత్యం పుడుతూండాలి.
ఉద్యమ సిద్ధి సాధించేవరకు
మాకు మోక్షం వొద్దు.
జన్మ యివ్వు చాలు తల్లి.

– సురేంద్రదేవ్ చెల్లి

## విత్తనం

**మట్టి** హృదయంలో
చిగురించాలని
విత్తనం ప్రయాణం నిరంతరం
పురిటినొప్పులు భరించి
చిగురు బిడ్డకు
జన్మనిచ్చిన తల్లిప్రేమ
విత్తనానికే తెలుసు
పోరాటం లేకపోతే బతుకులో
వెలుగు రాదు.

విత్తనమే కదా మహావృక్షంగా
మారేది
ఆ లక్ష్యం మనిషికి కావాలి!
ఆ జీవన పోరాటం
నిత్యం అణువంత చిగురించాలి.
తాను బతుకుతూ
చిగురును బతికిస్తుంది
విత్తనం విజయానికి గుర్తు
నీలో నువ్వే ఆత్మవిశ్వాసపు
చిగురువు
నిజానికి ఒక అణుపోరాటం
కాలం జ్ఞాపకాల్లో
నిజాయితీకి నీవే ఊపిరి
చిగురు అద్దంలో
నీ రూపం
పావురంలా ఎగిరిపోతోంది.
చినుకై
నీ గుండె లోతుల్లోంచి
మానవత్వ వెలుగుల్ని
చిగురింపచేయి
పచ్చదనమొక్కటే
నీ బాట
ఆ బాటలో నవ్వుల జలపాతం
చైతన్యానికి నీవు
చిరునామా
నీవు చిన్నదానివి ఐనా
నీ జీవన ప్రయాణం మాత్రం
మనిషికోసమే త్యాగం
అద్భుతం నీ జీవితం

– నల్లా నరసింహామూర్తి

## పచ్చని బంధం

**మాటల** విత్తనాలు
జల్లుకుంటూ వెళ్లు,
పరిచయాల మొలకలు
మొలకెత్తుతుంటాయి!

చిరునవ్వుల నీళ్లు
పోసుకుంటూ వెళ్లు,
పచ్చదనాల బంధాలు
వెచ్చగా చిగురిస్తుంటాయి!
పెరుగుతున్న వాటిని
కాపాడుకుంటూ వెళ్లు,
అనుబంధాల పరిమళాలు
చల్లగా వీస్తుంటాయి!

వీచేవాటిని వదలక
అనుక్షణం ఆస్వాదించు,
హృదయాంతరాలలో
మమత నిండిపోతుంది!

ఇవ్వడమొక్కటే తెలిసిన
ప్రకృతి పెద్దరికం చూసి,
ప్రతిఫలం ఆశించక
ప్రతినిత్యం తోడుండు!

స్నేహించడం తప్పా
ద్వేషించడం ఎరుగని,
మహావృక్షమై ఎదిగి
నీడలా నిలుస్తుందు!

పచ్చని బంధం
పరవశంతో అల్లుకుపోతుంది!
చల్లని గంధం
పులకరించి నిలిచిపోతుంది!

– పుట్టి గిరిధర్

## వాస్తువార్త

వాస్తువిద్వాన్ సాయిశ్రీ
డా॥ దంతూరి పండరినాథ్
3-2-4, కింగ్స్‌వే, సికింద్రాబాద్- 3
సెల్స్: 9885446501/ 9885449458

# స్థలం ఒకరి పేరుతో, ఇల్లు మరొకరి పేరుతో ఉండవచ్చా?

**కె.కె - కర్నూలు**

**ప్రశ్న: 'బి' స్థలం అమ్మగారి పేరుతో రిజిస్టరై ఉంది. మునిసిపాలిటీలో ఇల్లు నా పేరుతో ఉన్నది. దీనివలన వాస్తుపరంగా ఇబ్బందులు ఉంటాయా? మేం ఉత్తరం దిశగా ఇల్లు కట్టినందు వల్ల ఎత్తు పెరిగింది. దక్షిణంలో గొయ్యి ఏర్పడింది. దీనివల్ల ఇబ్బందులు ఉంటాయా? మా పెళ్లయి 12 సంవత్సరాలు అయింది. సంతానం కలగలేదు. మా జాతకరీత్యా నాగదోషం వున్నది. నాగదోషం నివారణకోసం నాసిక్‌లో పూజలు చేయించాం. అయినా ఫలితం లేదు. వాస్తు ప్రభావంవల్ల మాకు సమస్యలు వస్తున్నాయా?**

**జవాబు:** స్థలం ఒకరి పేరున, ఆ స్థలంలో ఇల్లు మరొకరి పేరున రిజిస్టర్ అయి వుండటం కొన్ని సందర్భాల్లో జరుగుతుంటుంది. ముఖ్యమయిన విషయమేమిటంటే ఆస్తి ఎవరి పేరున రిజిస్టరై వుంటే ఆ వాస్తు మంచి- చెడు ఫలితాలు వాళ్లకే వర్తిస్తాయనుకోవటం సరయిన అవగాహన కాదు.

ఒక స్థిరాస్తి ఆదాయాన్ని ఎవరు అనుభవిస్తూ ఉంటారో ఆ స్థిరాస్తి వాస్తు ఫలితాలు కూడా వారికే వర్తిస్తాయి. ఒక స్థలం వాస్తు బాగా లేనపుడు చెడు ఫలితాలను తప్పించుకోవటానికి మరొకరి పేరుమీద రిజిస్టర్ చేయించి, ఆ ఆస్తిమీద వచ్చే ఆదాయాన్ని మాత్రం తామే అనుభవించటం- ఇలాంటి సర్దుబాట్లు మన తృప్తి కోసమేగానీ, వాస్తు విషయంలో ఇవన్నీ పనిచేయవు. దీనినిబట్టి మీ విషయంలో కూడా అన్వయించుకోవచ్చు. మీ ఉత్తర స్థల గృహానికి దక్షిణ దిక్కున గొయ్యి మంచిది కాదు. దానిని కూడా పూడ్చివేయటంవల్ల మీకు ఫలితాలు బాగుంటాయి. సంతాన ప్రాప్తి లేకపోవటానికి అనేక రకాల కారణాలుంటాయి. వాస్తుపరమయిన కారణాలు ఏవయినా వున్నాయేమో తెలుసుకోవాలంటే ఆ స్థలాన్ని, ఇంటినీ ప్రత్యక్షంగా చూసి, నిర్ధారణ చేసుకోవాలి. అందుకని వీలు చేసుకొని ఒకసారి మీ గృహ వాస్తుని చూపించే ప్రయత్నం చేయండి.

### పశ్చిమ దిశలో మెట్లు?

**మాణిక్యాలరావు - వరంగల్**

**ప్రశ్న: మేం ఇంటి నిర్మాణం పూర్తి చేసి గృహ ప్రవేశం చేసాం. మా గృహం ఇప్పుడు ఒకే అంతస్తు. ఆర్థికంగా కాస్త నిలదొక్కుకోవడంతో మేం మా ఇంటి మీద రెండో అంతస్తు వేయాలనుకుంటున్నాం. అందుకు ముందుగా మెట్ల నిర్మాణం చేయవలసి వున్నది. మాకున్న స్థలం అనుకూలతలనుబట్టి పశ్చిమ దిశలో మెట్లను నిర్మించాలనుకుంటున్నాం. పశ్చిమ దిశలో మెట్ల నిర్మాణం మంచిదేనా?**

**జవాబు:** పశ్చిమ దిశలో మెట్ల నిర్మాణం మంచిదేగానీ ఆ స్థలంలో కొన్ని దిక్కులకు అభిముఖంగా మెట్ల నిర్మాణం చేయడం వాస్తు విరుద్ధమవుతుంది. ఇంటికి ఆనుకొని పశ్చిమ వాయువ్యంలో దక్షిణాభిముఖంగా ఎక్కే మెట్లు నిర్మించుకోవచ్చు. అయితే పశ్చిమ వాయువ్యంలో ఉత్తరాభిముఖంగా ఎక్కే మెట్ల నిర్మాణం చెడు ఫలితాలనిస్తుంది. ఇంటికి ఆనుకొని పశ్చిమ భాగంగా ఉత్తరాభిముఖంగా ఎక్కే మెట్ల నిర్మాణం వల్ల ఆరోగ్య సమస్యలు, మన స్పర్థలు కలిగే అవకాశముంది. పశ్చిమ నైరుతిలో దక్షిణాభిముఖంగా ఎక్కే విధంగా మెట్ల నిర్మాణం సత్ఫలితాలనిస్తుంది. పశ్చిమ వాయువ్యంలో ఉత్తరాభిముఖంగా ఎక్కే మెట్ల నిర్మాణం వాస్తుపరంగా సరైంది కాదు. మెట్ల నిర్మాణంలో వాస్తు సూత్రాలను పాటించడం చాలా అవసరం. వాస్తు శాస్త్రరీత్యానే మెట్ల నిర్మాణం చేసుకోండి.

### మా స్థలానికి వీధిపోటు ఉందా?

**నరహరి - కావలి**

**ప్రశ్న: ఖాళీ స్థలంలో గృహ నిర్మాణం చేయాలనుకుంటున్నాను. అయితే ఉత్తరం, దక్షిణం వైపు వీధిపోటు వుందా? ఒకవేళ వుంటే విడిచిపెట్టాలా? '0' మార్కు వద్ద బోరు వేశాను. పడమర నుండి వీధిపోటు తగులుతుందా? దానికి పరిష్కారం తెలుపగలరు.**

**జవాబు:** మీరు పంపించిన ప్లాను ప్రకారం మీ ప్లాటుకి ఎటు పక్కనుండి కూడా వీధిపోటు లేదు. ఈశాన్యంలో బోర్‌వెల్ వేసారు. ఆ స్థానం సరైందే. మీకు పడమర వైపు ఉన్న ఇతరుల ప్లాటుకి వీధి పోటు తగిలే అవకాశముంది. మీరు వాస్తు నియమాల ప్రకారం మీ ప్లాట్‌లో గృహ నిర్మాణం గావించుకోవచ్చు. పశ్చిమ వాయువ్య వీధిచూపు మంచి ఫలితాలనే ఇస్తుంది. చెడు ఫలితాలనిచ్చే వీధిపోట్లు కానీ, మంచి ఫలితాలనిచ్చే వీధిచూపులు కానీ ప్రత్యక్షంగా ఏ క్షేత్రానికి తగులుతాయో, ఆ క్షేత్రం ఎక్కువ ప్రభావపూరితమవుతుంది. ఆ తరువాత క్షేత్రాలు (అదే వరుసలో) క్రమంగా తక్కువ ప్రభావపూరితమవుతుంటాయి.

### గేటుకి ఎదురుగా నుయ్యి ఉండవచ్చా?

**సాయికుమార్ - జొన్నలగడ్డ**

**ప్రశ్న: పశ్చిమ ద్వారానికి ఎదురుగా ఒక గేటు, పశ్చిమ వాయువ్యంలో ఒక గేటు పెట్టించాను. అయితే రెండు గేట్లకి మధ్య దూరం 4 అడుగులు. గేటుకి ఎదురుగా నుయ్యి, ఉత్తర ఈశాన్యం గేటుకి ఎదురుగా నుయ్యి వుండకూడదని అంటున్నారు. నుయ్యి మార్చలేం. గేటు తీసివేయవచ్చా? వేరే ఏదయినా మార్గం వున్నదా? ఇల్లు అద్దెకు ఇచ్చాం. ప్రస్తుతం సమస్య లేమీ లేవు. కానీ నా భార్యకి అనారోగ్యం. రోజూ ఏదో సమస్యతో బాధపడుతూ వుంటుంది.**

**జవాబు:** నుయ్యికి ఎదురుగా వచ్చే గేటు తీసివేసి గోడ పెడితే ఆ దోషం పోతుంది. తూర్పు హద్దుల్లో వేరేవాళ్ల ఇల్లు వున్నది. అందువల్ల ప్రహరీ నిర్మించలేదని రాసారు. కానీ అలా వుండకూడదు. తూర్పు భాగంలో ఒకటి, రెండు అడుగుల ఖాళీ వదిలేసి ప్రహరీగోడ తప్పని సరిగా నిర్మించాలి. ■

---

వాస్తువిద్వాన్ డా॥ దంతూరి పండరినాథ్ పాఠకుల సమస్యలకు ఆదివారం 'వాస్తువార్త'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమస్యలు పంపవలసిన చిరునామా: సాయిశ్రీ వాస్తు కన్సల్టెన్సీ, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్-3

వాస్తువార్త

పూర్తి పేరు: ------------------------------------------
పుట్టినతేదీ:------------------ ఊరు: --------------
జన్మనక్షత్రం:----------తల్లిపేరు:----------------------
చిరునామా: ------------------------------------------
------------------ ఫోన్: ----------------------

